# సంపాదకీయం

" Head of Sankara, Heart of Buddha, Hand of Janaka, శంకరుని మేధస్సు, బుద్ధుని హృదయం, జనకుని హస్తం - మీ స్వంతం చేసుకోండి ! పూర్ణమానవులు కండి!" అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు.

భారతదేశం ఈనాడు ఎదుర్కొంటున్న అనేక జటిల సమస్యలనుండి బయటపడి, దేశం సర్వతోముఖాభివృద్ధి చెందాలంటే ఆదిశంకరులవంటి మేధావులు, బుద్ధునివంటి కరుణాహృదయులు, జనకుని వంటి నిష్కామకర్మయోగుల అవసరం ఎంతైనా ఉన్నది.

ఆసేతు హిమాచలపర్యంతం, కాలినడకన పర్యటించి, ఆత్మవిస్మృతి చెంది నిద్రాణమైఉన్న జాతిని మేలుకొలిపి, నాలుగు మూలలా నాలుగు మఠాలను నెలకొలిపి, అద్వైతబ్రహ్మవిద్యా ప్రచారమును గావించి, భారతదేశం సమైక్యతను, సమగ్రతను, పరిరక్షించిన మహామేధావి, సమర్థుడైన సంఘసంస్కర్త ఆదిశంకరులు.

ఈ దేశంలో హింసాప్రవృత్తి హెచ్చుపెరిగి పైశాచిక ప్రవృత్తి విశృంఖలంగా, విలయతాండవం చేస్తున్న దుర్దినాలలో, ప్రజలలో అహింసావాదాన్ని ప్రబోధించి, హింసా ప్రవృత్తిని విడనాడేటట్లుచేసి, ప్రేమతత్వాన్ని ప్రబోధించి, ప్రజలలో దయ, కరుణలాంటి దైవీ గుణాలను పెంపొందింపజేసిన కరుణామూర్తి గౌతమబుద్ధుడు.

సువిశాల సామ్రాజ్యానికి అధిపతియైవుండి కూడా, సకలరాజభోగాలను కలిగివుండి కూడా, ఆ సామ్రాజ్యం సిరిసంపదలతో విలసిల్లుతున్నప్పటికినీ, అట్టి భౌతిక సంపదల యెడల వ్యామోహమును విడనాడి, నిమిత్తమాత్రంగా ఉంటూ, ప్రజానురంజకంగా పరిపాలన కొనసాగించి ప్రజల మన్ననలను పొందిన నిష్కామకర్మయోగి, రాజర్షి జనక మహారాజు.

ఈ ముగ్గురూ ముగ్గురే. జనకుని వంటి నిస్వార్థపరులైన పాలకులు, ఆదిశంకరులవంటి మేధాసంపత్తిని కలిగిన మంత్రులు, బుద్ధునివంటి కరుణాహృదయులైన నాయకులు ఈనాడు కావాలి. అట్టి వారి అవసరం ఈనాడు ఎంతైనా ఉన్నది. అప్పుడే ఈదేశభవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉంటుంది.

మానవజీవితంలో ఈ Three 'H' (Head, Heart, Hand) లు చాలా ప్రధానమైన పాత్రను పోషిస్తున్నాయి. అనగా మొట్టమొదట ప్రతిఒక్కరూ బుర్ర (Head) తో ఆలోచన చేయాలి. తరువాత హృదయం (Heart) తో పరిశీలన చేయాలి. తదుపరి చేతుల (Hands) తో ఆచరించాలి.

"ఆలోచన, పరిశీలన, ఆచరణ" - దీనినే 'త్రికరణశుద్ధి' అన్నారు. ఈ త్రికరణశుద్ధి కలిగినప్పుడు 'జ్ఞానసిద్ధి' కూడా మనకు లభ్యమవుతుంది. త్రికరణశుద్ధితో చేపట్టిన కార్యాలు విజయవంతంగా సఫలీకృతమవుతాయి. త్రికరణశుద్ధిలేకుండా ఏకార్యం తలబెట్టిన అది సఫలీకృతంకాదు.

"మనసులోని యోచన, మాటలోని సూచన, క్రియలోని ఆచరణ - ఈ మూడూ ఏకంకావాలి" అన్నారు బాబా. కనుక మాట్లాడే ప్రతిమాట ఆచితూచి మాట్లాడటం నేర్చుకోవాలి. మాటకు ఖర్చులేదుగాని, విలువ ఎక్కువ. పూర్వకాలంలో మాటకు ఉండే విలువ నోటుకు కూడా ఉండేదికాదు. అయితే ఈనాడు చాలామంది మనసులోచేసే యోచన ఒకటి, మాట్లాడే మాట మరొకటి, చేసే చేతలు వేరొకటి. ఈవిధంగా ఈనాడు "త్రిపాత్రాభినయం" చేసే "పయోముఖ విషకుంభాలు" రోజురోజుకు పెరిగిపోతున్నారు. ఇట్టివారివలన కుటుంబానికి, దేశానికి చేటు, ప్రమాదం.

ప్రతిమానవునికి Head, Heart, Hand చాలా ముఖ్యం. వాటిని అత్యంత పవిత్రంగా కాపాడుకోవాలి. దురాలోచనలకు తలలో తావివ్వకుండా, దూరాలోచనలు చేస్తూ, సదాలోచనలకు అవకాశం యిస్తూ, హృదయమును అత్యంత పవిత్రంగా, నిర్మలంగా ఉంచుకొని, స్వార్థరహితమైన సేవలను చేస్తూ సర్వజనసమ్మతంగా వ్యవహరిస్తూ ముందుకు సాగిపోవాలి.

"మంచిని యోచించు, యోచించిన దానిని మంచిగా తలంచు, తలంచిన దానిని హస్తములలో పెట్టుకొని సక్రమంగా ఉపయోగించు" అని అంటారు బాబా. ఇదే Three 'H' (Head, Heart, Hand) పరమావధి, లక్ష్యము. కనుక మనం మంచినే చూద్దాం, మంచినే తలుద్దాం, మంచినే చేద్దాం - ఇదే మానవత్వానికి పునాది, దానవత్వానికి సమాధి.

- కొమరగిరి కృష్ణమోహనరావు

మే 1998
సంపుటి 14 సంచిక 4

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
© 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of *"SREEVANI"* Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

Printed at
***SREEVANI OFFSET PRINTERS***
Machilipatnam

Despatched on
**7- 5 -1998**

# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



ముఖచిత్రం : **జగద్గురు ఆదిశంకరాచార్య**

# అమృతవాణి

శ్లో॥ ధర్మస్య దేహఃఖలు సాధనం స్యాత్
లోకస్తు తత్సాధకకార్యరంగః
తల్లోకదేహౌ పరిరక్షణీయౌ
పత్రం కవీశైరివ లేఖినీ చ

- శ్రీ గణపతి సచ్చిదానంద

ధర్మాచరణం చేసే వానికి దేహం సాధనం. ఆ సాధనం పని చేసే రంగం జగత్తు. కనుక ఆ లోకము, దేహము రెండూ జాగ్రత్తగా రక్షింపదగినవి. ఎలాగంటే కవీశ్వరులకు కలం, కాగితంలాగా.

ధర్మం లోకానికాధారభూతం. ధర్మం లోపిస్తే లోకం దెబ్బ తింటుంది. నిమ్మకాయ పుల్లగా ఉంటే దాని ధర్మం తిన్నగానే ఉందన్నమాట. తీయగా ఉందనుకోండి. ఆ తీపి దాని ధర్మం కాదు. తింటానికి బాగుండవచ్చు కాని అప్పుడది నిమ్మకాయ కాదు. దాని ధర్మమే దాని కుండాలి గాని పరధర్మం ఏపిల్ పండు ధర్మం దానికుండ కూడదు. అదేవిపర్యయం గీతలో కూడా 'పరధర్మో భయావహః' అన్నాడు పరమాత్మ. మానవుడైనా అంతే. తన ధర్మాన్ని తాను పాటించాలి గాని ఇతరుల ధర్మం పాటించరాదు. నీది ఏ ధర్మమో అదే నీవు పాటించాలి. కాని ఇతరులది కాదు. గురువు పాఠం చెపుతుంటే విద్యార్థి వినాలి. విద్యార్థి చెప్పటం ప్రారంభిస్తే పరిపాలన అస్తవ్యస్తం అవుతుంది.

వర్ణాశ్రమధర్మాలున్నాయికదా ఏ వర్ణానికి, ఏ ఆశ్రమానికి ఏది ధర్మమో దాన్ని ఆ వర్ణం వారు, ఆ ఆశ్రమం వారే పాటించాలి. సన్యాసి గృహస్థ ధర్మం పాటిస్తే మంచిదా? గృహస్థు సన్యాసి ధర్మం పాటిస్తే మంచిదా? కాదు. అలా చేస్తే ధర్మవ్యతిక్రమం జరుగుతుంది. దానివల్ల సమాజ వ్యవస్థకు యిబ్బంది కలుగుతుంది. పోలీసు గుమాస్తా చేసే పని చేస్తే గుమాస్తా పోలీసు చేసే పని చేస్తే ప్రభుత్వం సహిస్తుందా? సహించదు. పాలన కుంటుపడుతుంది కనుక. అలాగే ఒకరి ధర్మం ఒకరు పాటిస్తే భగవంతుడు సహించడు. ధర్మగ్లాని ఏర్పడిందని తాను ఏదో చర్య తీసుకోక తప్పదు.

దేవతల కీయవలసిన హవిస్సులు రాక్షసులకిస్తే వ్యవస్థ మారిపోతుంది. కనుకనే పరమాత్మ ధర్మగ్లానిని సహించడు.

వర్ణాశ్రమ ధర్మాలు తలక్రిందులైతే పరమేశ్వరుడు చర్య తీసుకొన్నట్లే లౌకిక పరిపాలనలో ఒకరి పని మరొకరు చేస్తే అసలు పని కుంటుపడి పాలకులు చర్య తీసుకుంటారు. ఇది అనుభవంలో ఉన్నదేగా, ఏ పనికైనా అధికృతులయిన వారే అర్హులు.

## కూచిభట్ల చంద్రశేఖర శర్మ

ఈ ధర్మాన్ని తు.చ తప్పకుండా ఆచరించాలి కదా! ఆచరిస్తేనే ధర్మమౌతుంది ఆచరించాలంటే ఆచరించేవాడు, ఆచరించవలసిన చోటు ముఖ్యం. ఇందులో ఏది లేకపోయినా జరగదు.

ఆచరణ అంటే కర్మ. కనుక శరీరం తిన్నగా ఉంటేనే కర్మ చేయగలం లేకపోతే లేదు. ఆ దేహాన్నే సాధనం అన్నారు.

అంటే దేహమనే సాధనంతో ధర్మం చేస్తే సాధ్యమైన ఫలమేదో లభిస్తుంది. పనిముట్టు లేకపోతేనో, దెబ్బతింటేనో, పని తిన్నగా చేయలేము. దానివల్ల ఫలం రాదగినంతరాదు. అలాగే ధర్మం ఆచరించాలంటే శరీరం ఆరోగ్యంగా తిన్నగా ఉండాలి. ఆరోగ్యంగా ఉండేటట్లు కాపాడుకోవాలి. అందుకని శరీరానికి కావలసిన శక్తిని కలిగించటానికి ఆహార విహార నియమం పాటించాలి. అందుకనే ధర్మ నిర్వహణలో జాగ్రత్తగా శరీరధారణ చేయాలి కనుక దానికనుగుణమైన ఉపవాసాదులు పాటించాలి. ఇదే మనసులో పెట్టుకొని "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అన్నారు.

# ఆది శంకరాచార్యులు

**"శృతి స్మృతి పురాణానాం**
**ఆలయం కరుణాలయం**
**నమామి భగవత్పాద**
**శంకరం లోకశంకరమ్॥"**

సాంఘికంగా, రాజకీయంగా, ధార్మికంగా మహా సంక్షోభ పరిస్థితుల్లో అల్లకల్లోలమై అనేక రకాల మత విధానాలతో అస్తవ్యస్తమైన సమాజానికి శాంతిని ప్రసాదించటానికి ఆర్యాంబ, శివగురు దంపతులకు జన్మించారు "ఆది శంకరులు"

ఎనిమిది సంవత్సరాల వయస్సుకే సమస్త విద్యాపారంగతులైన శంకరులు సమాజ శ్రేయస్సు దృష్టి యందుంచుకుని సన్యాసాశ్రమాన్ని స్వీకరించారు.

మానవుని శాంతి సౌభాగ్యాలను అభిలషించి శంకరులు సర్వవ్యాపకము అనంతము అయిన పరమ సత్యాన్ని మానవుని దృష్టికి తీసుకువచ్చారు. ప్రకృతిలో అడుగడుగునా, అణువణువునా తేజరిల్లి ఉన్న తత్త్వాన్ని దర్శించగల సమర్థత మానవునికి అందించటమే శంకరాచార్యుల వారి ధ్యేయం. ఆ మహాజ్ఞాన సిద్ధికిగాను శంకరులు ప్రతిపాదించినదే అద్వైతం. "అద్వైతము" అనగా రెండవది లేనిదని అర్థం. ద్వైతభావం లేకుండగా సర్వత్ర వాసుదేవ సందర్శనం చేయ గల దివ్యత్వం శంకరుల బోధనల ద్వారా పొందగలరు.

**గేయం గీతానామసహస్రమ్**
**ధ్యేయం శ్రీపతి రూపమజస్రమ్.**
**నేయం సజ్జన సంఙ్గాచిత్తం**
**దేయం దీనజనాయచ విత్తం॥**

"వాక్కును విష్ణునామసంకీర్తనలోను, బుద్ధిని శ్రీపతి రూప ధ్యానంలోను, చిత్తాన్ని సజ్జనసాంగత్యంలోను వ్యయం చేయుము". అని భజగోవింద శ్లోక మంజరిలో వీరి ఆదేశం. నదివంటి ఆలోచనా ప్రవాహంలోని అన్ని బిందువులనూ సక్రమంగా వాడుకోవాలంటే మనోనిగ్రహం వల్ల అమోఘమైన శక్తిని కూడగట్టుకోవాలి. బుద్ధిలో ప్రశాంతతే జీవితానికి ఆనందం. సమస్యలతోను, సంఘర్షణలతోను, వాటి వత్తిడితో స్వస్వరూపాన్ని గురించి ఆలోచన లేక తనలోని అనంతమైన జ్ఞానాన్ని సదా సిద్ధించి ఉన్న దానినే సాధ్యం చేసుకోలేని నిస్సహాయస్థితి నుండి మానవుని పరమసత్యం వైపు అంతర్ముఖం చేయడానికి గాను శంకరులవారి బోధామృతం వరదలై ప్రవహించింది. ఉపనిషత్తులు మోక్షం పొందు మార్గమును సవివరంగా వివరించినాయి.

## పునర్వసు

మోక్షమునకు గల నిర్వచనమేమిటి? అని ఆలోచిస్తే "జీవాత్మ, బ్రహ్మమును గుర్తించి అందైక్య మగుటయే మోక్షము". అని చెప్తారు. జీవాత్మ, బ్రహ్మము వేరు వేరు కాదు. అవి రెండు ఒక్కటే అని తెల్సుకోవడమే మోక్షమని ఉపనిషత్తులు ఉద్ఘోషిస్తున్నాయి.

జగద్గురు శంకరాచార్యులు వారు ఒకేఒక శ్లోకంలో మానవాళికి అతి సులువుగా అర్థం అయ్యేటట్లు గ్రంధసారమంతటినీ ఇలా వివరించారు.

**" శ్లోకార్థేన ప్రవక్ష్యామి**
**యదుక్తం గ్రంధ కోటిభి:**
**బ్రహ్మ సత్యం జగన్మిధ్య**
**జీవో బ్రహ్మైవనా పరః "**

ఇంకా శంకరుల వారు భక్తి గురించి శివానంద లహరిలో ఇలా చెపుతారు.

**" అంకోలం నిజ బీజ సంతతి రయస్కాంతో**
**పలం సూచికా**
**సాధ్వీనైజపతింలతాక్షితిరుహంసింధు స్సరి**
**ద్వల్లభం**

ప్రాప్నోతీ హయధాతధాపశుపతీః
పాదారవింద ద్వయం
చేతో వృత్తి రుపేత్యతిష్టతి సదాసాభక్తిత్యుచ్యతే"

తా॥ తొలకరి ఉరుము ఉరిమినంతనే నేలరాలిన ఊడుగ విత్తనములు వృక్షమును అంటుకొనును. సూది అయస్కాంతము నంటుకొనును. పతివ్రత భర్తను చేరును. తీగ వృక్షమును చుట్టుకొనును. నది సాగరమును చేరును. ఆ రీతిగానే మనస్సు పరమేశ్వర పాదారవిందములచేరి యెల్లప్పుడు ఉండును. అదియే భక్తి అనబడును.

జీవుని గూర్చి శంకర గ్రంధరత్నావళిలో ఇలా అంటారు.

**శ్లో॥ అహమాత్మావచాన్యోస్మి బ్రహ్మైవాహం నశోకభాక్**
**సచ్చిదానంద రూపోహం నిత్యముక్తస్వభావాన్॥**

తా॥ "నేను ఆత్మను. ఇతరమునుగాను, బ్రహ్మనే నేను. నాకు దుఃఖము లేదు. నేను సచ్చిదానంద రూపుడను. నిత్యయుక్త స్వభావుడను."

బ్రహ్మమును తెలుపుట చేతనే వేదములకు వేదత్వము కల్గినది. బ్రహ్మాత్మైక విజ్ఞానదాయకము అయిన వాక్యములను తీసుకొని వివరించుటయే శంకరుల మహావాక్యచతుష్టయ పరమాశయము.

1. ప్రజ్ఞానంబ్రహ్మ - ప్రజ్ఞానం బ్రహ్మరూపము (ఋగ్వేదము)

2. **అహంబ్రహ్మాస్మి** - జీవుడనైన నేను బ్రహ్మ పదార్ధమగు చున్నాను (యజుర్వేదం)

3. **తత్వమసి** - ఆ పరమాత్మ జీవుడవైన నీవగుచున్నావు (సామవేదం)

4. **అయమాత్మాబ్రహ్మ** - ఈ జీవుడు పరబ్రహ్మ (అధర్వణ వేదం)

ఈ మహా వాక్యాలను ప్రచారము చేసి వైదిక మతోద్ధరణకు నాలుగు పీఠములను దేశం నాలుగు చెరగులా స్థాపించారు.

1. **పూర్వామ్నాయగోవర్ధన మఠము** : దీనికి మొదటి ఆచార్యుడు "పద్మపాదుడు". ఋగ్వేదమందలి "ప్రజ్ఞానం బ్రహ్మ" అనునది ఈ పీఠ మహావాక్యము. ఈ పీఠ అధిదేవత "జగన్నాధుడు", శక్తి "విమల" ఒరిస్సా రాష్ట్రంలోని "పూరి" పీఠక్షేత్రం.

2. **దక్షిణామ్నాయ శృంగేరి మఠము** : దీనికి మొదటి ఆచార్యుడు "సురేశ్వరాచార్యులు". యజుర్వేదమందలి 'అహం బ్రహ్మాస్మి' ఈ పీఠ మహావాక్యము. ఈ పీఠ అధి దేవత "ఆది వరాహుడు," శక్తి "శారదాదేవి". కర్ణాటక రాష్ట్రంలోని "శృంగేరి" పీఠ క్షేత్రం.

3. **పశ్చిమామ్నాయ ద్వారకా మఠము** : ఇది శంకర భగవత్పాదులచే మొట్టమొదట స్థాపించబడినది. దీని మొదటి ఆచార్యుడు "హస్తమలకుడు" సామవేదమందలి "తత్వమసి" ఈ పీఠమహావాక్యము. ఈ పీఠ అధిదేవత "సిద్దేశ్వరుడు" శక్తి "భద్రకాళి". "ద్వారక" ఈ పీఠ క్షేత్రం.

4. **ఉత్తరామ్నాయ మఠము** : దీని మొదటి ఆచార్యుడు "తోటకుడు". అధర్వణ వేదమందలి "అయమాత్మా బ్రహ్మ" ఈ పీఠము మహావాక్యము.

ఈ పీఠ అధిదేవత "నారాయణుడు", శక్తి పూర్ణగిరి", ఇది కాశ్మీరు నందుగలదు. జ్యోతిర్మఠ మనియు, శ్రీ మఠమనియు అందురు.

## ఆదిశంకరుల జీవిత సంగ్రహం

"అష్టవర్షే చతుర్వేదీ
ద్వాదశే సర్వశాస్త్రవిత్
షోడశే కృతవాన్ భాష్యం
ద్వాత్రింశో మునిరభ్యగాత్"

ఎనిమిదేండ్ల నాటికే చతుర్వేద విదురుడయ్యెను. పంద్రెండేండ్ల ప్రాయముననే సర్వ శాస్త్ర పారంగతుడయ్యెను. పదునారేండ్లకే బ్రహ్మ సూత్రాలకు భాష్యము చెప్పెను. ముప్పది రెండు సంవత్సరములకే మునియై అవతారమును చాలించెను.

అనేకమైన స్తోత్రాలు, వేదాంతగ్రంధాలు, భాష్యాలు ఒకటేమిటి ఆయన ఉపదేశాలు అన్ని రకాల మనస్తత్వాలనూ ఉద్ధరించే విధంగా రమణీయంగా కమనీయంగా సాగిపోయాయి.

వాటిలో "వివేక చూడామణి" మానవునికీ, ప్రపంచానికీ ఆధారమైన మహా ధర్మానికీ ఉన్న సంబంధం తెలియజేసే ఈ గ్రంధంలో సమస్త భారతీయ మహర్షుల అనుభూతినీ పొదిగారు శ్రీ శంకరాచార్యులవారు.

**"సకల నిగమచూడాస్వాన్త సిద్ధాంతరూపం**
**పరమిదమతి గుహ్యం దర్శితం తామయాద్య"**

"సకల వేదములకు శిరస్సులయిన ఉపనిషత్తులయొక్క హృదయమునందు అతిగుహ్యమైన సిద్ధాంత రూపమైన మహాజ్ఞానాన్ని ఈ గ్రంధంలో సులభంగా వివరించటం జరిగింది." అని వివేకచూడామణి గురించి శ్రీ శంకరాచార్యులవారు స్వయంగా శెలవిచ్చారు.

అర్ధరహితమైన నియమాలతో కట్టడులతో మానసికంగా కృంగిపోయి, తనను తాను తక్కువగా భావించుకుంటూ తన జన్మను నిరసించుకుంటూ దీనంగా బ్రతికే సామాన్యమానవునికి

**"దుర్లభంత్రయమే వైతద్దేవానుగ్రహహేతుకమ్ ।**
**మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః ॥"**

అని బోధించి తరింపచేసిన మహాపురుషుడు ఆదిశంకరాచార్యులు.

"ఆత్మాత్వం గిరిజామతిః సహచరాః ప్రాణాః శరీరం గృహం
పూజాతీ వివిధోపభోగరచనా నిద్రాసమాధిస్థితిః
సంచారస్తు పదోః ప్రదక్షిణ విధిః స్తోత్రాణి సర్వాగిరో
యద్ యద్ కర్మ కరోమి తత్తదఖిలశంభో తవారాధనమ్॥
(శంకరుల ఆత్మపూజ నుండి)

# భజగోవింద శ్లోకములు

## (భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు అందించిన అనువాదము)

1. **భజగోవిందం, భజగోవిందం**
**గోవిందం భజమూఢమతే**
**సంప్రాప్తే సన్నిహితే కాలే,**
**నహినహి రక్షితి డుకృఞ్ కరణే॥**

హరిగోవిందా హరి గోవిందా
హరిగోవిందా అనరామందా
మృత్యువు దాపున మసలేటప్పుడు
వ్యాకరణము కాపాడదురా॥

2. **నళినీదళగత జలమతి తరళం**
**తద్వత్ జీవిత మతిశయ చపలమ్**
**విద్ధివ్యాధ్యభిమానగ్రస్తం**
**లోకం శోకహతం చ సమస్తమ్॥**

తామరాకుపై తళతళలాడే
నీటిబొట్టువలె నిలకడ లేనిది
బ్రతుకభిమానపు తెగులు పుట్టరా
దిగులు దుఃఖముల తెరరా లోకము

3. **బాలస్తావత్ క్రీడాసక్త**
**తరుణస్తావత్ తరుణీసక్తః**
**వృద్ధస్తావత్ చింతాసక్తః**
**పరమే బ్రహ్మణీ కో పినసక్తః**

ఆటలపాటల బాల్యంబాయెను
ప్రాయములో ప్రేమాయణమాయెను
ముదిమిని చింతలు ముదిరేపోయెను
పరబ్రహ్మ కాబట్టక పోయెను

4. **కాతే కాంతా కస్తే పుత్రః**
**సంసారో యవతీవ విచిత్రః**
**కస్యత్వం కఃకుత ఆయాతః**
**తత్త్వం చింతయ తదిహ భ్రాతః**

ఎవతె భార్య; ఇంకెవడో బిడ్డడు?
ఎంత విచిత్రమో యీ సంసారము
ఎవరివాడ? వెవ్వెడ? వెటు వచ్చితి ఆ
తత్త్వమిక్కడే తమ్ముడ తెలియర

5. సత్సంగత్వే నిస్సంగత్వం,
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చల తత్త్వం
నిశ్చలతత్వే జీవన్ముక్తి:॥

సత్సంగముచే సహజ విరక్తి
ఆ విరక్తి చే విగతభ్రాంతీ
భ్రాంతి తీరితే శాంతీ స్తిమితము
స్తిమిత శాంతిచే జీవన్ముక్తి

6. దిన యామిన్యౌ సాయంప్రాత:
శిశిర వసంతౌ పునరాయాత:
కాల క్రీడతి గచ్ఛత్యాయు:
తదపి న ముచంత్యా శావాయు:

రేయి పవళ్ళు సాయంప్రొద్దులు
చలి వేసవులూ సారెకు మారును
కాలక్రీడల గడచే నాయువు
ఐనావదలదు ఆశావాయువు

7. యోగరతోవా, భోగరతోవా,
సంగరతో వా సంగవిహీన:
యస్య బ్రహ్మణి రమతే చిత్తం,
నందతి నందతి నందత్యే వ॥

యోగియైన మరిభోగియైన
సంసారియైన సన్యాసియైననూ
స్వాంతము సత్యము ననుభవించితే
ఆనందమే ఆనందము నందము

8. భగవద్గీతా కించి దధీతా
గంగా జల లవ కణికా పీతా
సకృదపి యేన మురారి సమర్చా,
తస్యయమ: కిం కురుతే చర్చామ్

కించిద్భగవద్గీతా పఠనము
కొంచెము గంగా తీర్థము పానము
హరిపూజన మొకపరి కావించిన
అతనిని యముడేమని తర్కించును

9. పునరపి జననం పునరపి మరణం,
పునరపి జననీ జఠరేశయనం
ఇహ సంసారే బహుదుస్తారే
కృపయా పారే పాహిమురారే

మళ్ళీ పుట్టుట మళ్ళీ గిట్టుట
అమ్మ కడుపులో అణగి యుండుట
అంతులేని సంసారముదయతో
దాటింపుము నను దబ్బున దేవా

10. త్వయి మయి సర్వత్రైకో విష్ణు:
వ్యర్థం కుప్యసి మయ్య సహిష్ణు:
భవ సమచిత్త స్సర్వత్ర్యం,
వాంఛస్యదిరాద్య ది విష్ణుత్వమ్॥

నీలో నాలో నిజమొక విష్ణువె
ఓపిక లేని నీ కోపము వ్యర్థము
ఎల్లెడ సమమై ఉల్లంబుంటే
అపుడే అనుభవమగు విష్ణుత్వము

11. శత్రౌ మిత్రే పుత్రౌ బంధౌ,
మా కురు యత్నం విగ్రహ సంధౌ
సర్వస్మిన్నపి పశ్యాత్మానం
సర్వ త్రోత్సృ జ భేదాజ్ఞానమ్॥

శత్రుడు మిత్రుడు పుత్రుడు బంధువు
అనుచు ఉపేక్షాపేక్షలు మానుము
అన్నిటిలోను ఆత్మనె చూడుము
భేదమనే అజ్ఞానము వీడుము

12. గేయం గీతానామ సహస్రం,
ధ్యేయం శ్రీపతి రూపమజస్రమ్
నేయం సజ్జన సంగేచిత్తం
దేయం దీనజనాయ చ విత్తమ్॥

పాడుము గీతలు నామ సహస్రము
భగవంతుని రూపముభావింపుము
సలుపుమెపుడు సజ్జన సాంగత్యము
దీన జనులకై దానము చేయుము

13. అర్థమనర్థం భావయ నిత్యం
నాస్తి తతస్సుఖలేశః సత్యం
పుత్రా దపి ధన భాజాం భీతిః
సర్వత్రైషా విహితా రీతిః

ధనమే కీడనుకొనురా నిత్యము
దానలేదు సుఖ లేశము సత్యము
కొడుకుకైనా భయపడురా ధనికుడు
నడచేదిదే యెల్లెడల నెప్పుడు

14. ప్రాణాయామం ప్రత్యాహారం,
నిత్యానిత్య వివేక విచారమ్
జాప్య సమేత సమాధి విధానం,
కుర్వవ ధానం మహదవ ధానమ్॥

ప్రాణాయామము ప్రత్యాహారం
నిత్యానిత్య వివేక విచారము
మంత్రము తోడ సమాధి విధానము
జాగ్రత్తగా నిశ్చలముగా చేయుము

15. కామం, క్రోధం, లోభం, మోహం,
త్యక్త్వా త్మానం భావయకో హమ్
ఆత్మజ్ఞాన విహీనా మూఢా,
స్తే పచ్యంతే నకరనిరూఢా :॥

కామము క్రోధము లోభము మోహము
విడువుము, నేనెవ్వడనని యనుకో !
తము తామెఱుగని దద్దమ్మల కగు
నరకము లోపల నానా బాధలు

16. గురు చరణాంబుజ నిర్భర భక్తః,
సంసారాచిరాద్భం ముక్తః
సేంద్రియమానస నియమాదేవం,
ద్రక్ష్యసినిజ హృదయస్థం దేవమ్

సద్గురు చరణాబ్జముపై భక్తీ
త్వరగా ముక్తికి తరలే మార్గము
ఇంద్రియ మానస సాంద్ర నియమమే
హృదయస్థుని చూపించును దేవుని

## సిద్దప్ప

శ్రీపోతులూరి వీరబ్రహ్మేంద్ర యోగి ప్రియ శిష్యుడు సిద్దప్ప. కడప జిల్లాలో కందిమల్లయపల్లికి *10కి.మీ.దూరంలోగల* ముడుమాలలో సిద్దప్ప జన్మించాడు. తండ్రి పేరు సాహెబు, తల్లి ఆదంబీబీ. వీరు దూదేకులవారు. ఒక సిద్దుని ప్రసాదం వల్ల జన్మించిన తమ కుమారునికి వారు సిద్దప్ప అని పేరు పెట్టుకొన్నారట.

సిద్దప్ప వీరబ్రహ్మం గారిని గురువుగా స్వీకరించి పన్నెండేళ్ళపాటు సేవించాడు. బ్రహ్మంగారి మార్గాన్ని ఊరూరా తిరిగి ఆయన ప్రచారం చేశారు. అందుకాయన స్వతంత్రంగా కొన్ని తత్త్వాలు, పాటలు, ఏలలు, పద్యాలు రచించారు. 'కాళికాంబ హంస కాళికాంబ' అన్న మకుటంతో ఆయన నాలుగు వందల పద్యాలు రచిరచారు. ఆయన పద్యాలు, వచనాలు, తత్త్వాలు ఉన్న పుస్తకమొకటి 'సిద్దప్ప వచనాలు' అన్న పేరుతో మద్రాసు (ప్రస్తుతం చెన్నై) లో ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉంది. ఈయన చిన్నతనం నుండి మద్య మాంసాలను ముట్టలేదు. బట్టలు నేసే వృత్తి వలన జీవనం సాగించాడు. కులం, మతం-వీటిని ఆయన వదిలినా, అవి ఆయనను వదలక బాధించాయి. హిందువులు, చివరకు బ్రహ్మంగారి కొడుకులు కూడా ఆయనను దూదేకుల వాడని కించపరచినట్లు, వీరబ్రహ్మంగారు జీవసమాధి అయ్యేముందు సిద్దప్ప దగ్గర ఉండకుండా దూరప్రాంతానికి పంపాలని ప్రయత్నించారని చెబుతారు. వీరబ్రహ్మంగారు తన సొంత కుమారులకు బోధించని వేదాంత రహస్యాలను సిద్దప్పకు బోధించారు. సిద్దప్ప కూడా సొంతంగా కాలజ్ఞానాన్ని రాశాడు.

ఆయన కూడా తన గురువువలె జీవసమాధి అయ్యారు. కాని ఆయన సమాధి, సిద్దప్ప మఠం సరయిన పోషణకు నోచుకున్నట్లు లేదు. సిద్దప్ప రచనలలో - 'ఏ కులమని నను వివరములడిగితె ఏమని చెప్పుదు లోకులకు, పలుగాకులకు', 'పూజకు నేనొస్తి-బ్రహ్మం పూజకు నేనొస్తి', 'మాయను నరకిన వాడు, గురురాయనితో జతగూడు', నే జూచినానే, బ్రహ్మం, నాలోనేజూచినానే'-వంటివి సుప్రసిద్ధాలు.

**- భండారు పర్వతాలరావు**

# కాత్యాయని

**చంద్రహాసోజ్జ్వలకరా శార్దూల వరవాహనా**
**కాత్యాయనీ శుభం దద్యాద్దేవీ దానవఘాతినీ.**

దుర్గామాత యొక్క ఆరవ స్వరూప నామం కాత్యాయనీ దేవి. ఈమెకు కాత్యాయనీ దేవి అన్న నామం ఏర్పడడానికి కారణం ఈ విధంగా ఉంది. కతుడనే ప్రఖ్యాతి చెందిన మహర్షి ఒకడుండేవాడు. ఆ మహర్షి పుత్రుని పేరు కాత్యుడు. ఈ కాత్య మహర్షి గోత్రంలోనే విశ్వవిఖ్యాతుడైన కాత్యాయన మహర్షి ప్రాదుర్భవించాడు. ఈ మహర్షి పరాంబను ఉపాసిస్తూ అనేక సంవత్సరాలు కఠోరంగా తపస్సు చేశాడు. పరమేశ్వరి తన సదనంలో పుత్రిగా ఆవిర్భవించాలన్నది ఆ మహర్షి అభిలాష. పరమేశ్వరి అతని అభీష్టాన్ని నెరవేర్చింది.

కొంతకాలం తరువాత మహిషాసురుని అత్యాచారాలతో తల్లడిల్లిన భూభారాన్ని దూరం చెయ్యాలని బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురూ తమ తమ తేజోంశాలను అర్పించి మహిషాసుర వినాశనార్థం ఓ దేవిని ప్రభవింపజేశారు. సర్వప్రథమంగా కాత్యాయన మహర్షి ఆ దేవిని ఆరాధించడం వల్ల ఆమె 'కాత్యాయని' అని పిలవబడింది.

ఈ ప్రసంగంలో మరో గాథ కూడా వినవస్తుంది. ఈ దేవియే కాత్యాయనుని సదనంలో పుత్రిగా అవతరించింది. ఆశ్వీజకృష్ణ చతుర్దశినాడు జన్మించి శుక్ల సప్తమీ, అష్టమీ, నవమీ పర్యంతం మూడు రోజులూ ఆ దేవి కాత్యాయన ఋషి పూజలు గ్రహించి దశమినాడు మహిషాసురుని వధించింది.

కాత్యాయనీ దేవి అమోఘ ఫలదాయిని, శ్రీ కృష్ణ భగవానుని భర్తగా పొందడానికి వ్రజగోపికలు యమునా తీరంలో ఈ దేవినే ఆరాధించారు. ఈమె వ్రజ మందిరంలో అధిష్ఠాత్రీ దేవి రూపంలో ప్రతిష్ఠింపబడి విరాజిల్లుతూ ఉంటుంది. ఈ తల్లి స్వరూపం అత్యంత భవ్యమై దివ్యమైనది. ఈమె వర్ణం స్వర్ణ సమంగా మెరుస్తూ భాసిల్లుతూ ఉంటుంది. ఈ దేవి చతుర్భుజాలతో అలరారుతూ ఉంటుంది. ఈమె దక్షిణ హస్తం పైన ఉన్నది. అభయ ముద్రలోనూ క్రిందిచేయి వరదముద్ర లోనూ ఉంటుంది. ఎడమవైపు పై చేతిలో ఖడ్గమూ, క్రింది హస్తంలో పద్మమూ రాజిల్లుతూంటాయి. ఈమె వాహనం సింహము.

## పురాణపండ రాధాకృష్ణమూర్తి

భక్తులు దుర్గాపూజలో ఆరవనాడు ఈ దేవీ స్వరూపాన్నే ఉపాసిస్తుంటారు. ఆ రోజున సాధకుని మనస్సు ఆజ్ఞాచక్రంలో లయమై ఉంటుంది. యోగసాధనలో ఈ ఆజ్ఞా చక్రానికి అత్యంత మహత్త్వ పూర్ణ స్థానముంది. ఈ చక్రంలో స్థితుడై ఉన్న సాధకుడు తన సర్వస్వాన్నీ కాత్యాయనీ దేవి చరణ కమలాలలో అర్పించి వేస్తాడు. పరిపూర్ణంగా ఆత్మ సమర్పణ చేయునట్టి సాధకునికి ఆ తల్లి దివ్యదర్శనం సహజంగా అవుతుంది. కాత్యాయనీ దేవి యందు భక్తి ఏర్పడడం, ఆ తల్లిని ఉపాసించడం ద్వారా మనుష్యమాత్రులకు అత్యంత సులభంగా ధర్మార్థకామమోక్షాలనే చతుర్విధ పురుషార్థ ఫలాలూ ప్రాప్తిస్తాయి. ఆ తల్లి భక్తులు ఇహంలో ఉంటున్నా అలౌకిక తేజో ప్రభావ సంపన్నులై భాసిల్లుతూ ఉంటారు. వారి రోగ శోక సంతాపభయాదులన్నీ నాశనమై పోతాయి. జన్మ జన్మాంతరాల పాపాలను నాశనం చేయడానికి మానవ మాత్రునికి మాతృపాసన కన్న మిన్నది అయినదీ అధిక సుగమ సరళ మార్గము మరేది లేదు. ఈ జననిని ఆరాధించే వారందరూ ఈ దేవి సాన్నిధ్యంలోనే ఉంటూ పరమ పదాధికారులవుతుంటారు. కనుక మనం సర్వతోభావేన మాతృ చరణాలను శరణు వేడి ఆమె పూజయందు తత్పరులమై ఉండాలి.

**"కాత్యాయనీ మాతకూ జై"**

శ్రీరామ నవమి సందేశం

## పాపాలను కరిగించి, శాపాలను నశింపజేసి మానవత్వాన్ని అభివృద్ధి పరచేదే

# రామతత్త్వము



"చక్కెర కంటె తీపి దధిసారము కంటెను రుచ్చమౌను పెం
పుగ తేనె కన్న అతిరుచ్యము నోటను పల్కపల్కగా
ఎక్కిలి కమ్మనౌ అమృతమే అనిపించును కాన నిత్యమీ
సత్యము దాని మీరు తలపోయుడు రామనామమున్"



ప్రేమస్వరూపులారా!

విశ్వమునకు రాముడే మిత్రుడు, అతనే హితుడు, అతనే యతుడు. ఇట్టి ఆదర్శమూర్తి అయినటువంటి రామచంద్రుని యొక్క తత్త్వమును గుర్తించుకోవటం అంత సులభం కాదు. సముద్రపు అలలను లెక్కించటం సులభమేమోకాని, రాముని యొక్క గుణ గణములను వర్ణించటం మాత్రం సాధ్యం కాదు. అందరి యందు ఉన్నది రామచంద్రుడే. విశ్వమే ఒక గృహము, యావత్ మానవజాతియే ఒక కులము. ఇట్టి సంబంధ బాంధవ్యమును గుర్తించినటువంటి వ్యక్తి మాత్రమే రామతత్త్వమును గుర్తించగలడు. అందరి పాదముల క్రింద ఉన్నది ఒకే భూమి. అందరి తలలపైన ఉన్నటువంటిది ఒకే ఆకాశమే! అందరూ పీల్చునది ఒకే గాలే. అందరూ త్రాగునది ఒకే నీరే. ఇట్టి ఏకతత్త్వమును గుర్తించినటువంటి వారు మాత్రమే రామతత్త్వమును తెలుసు కొనుటకు ప్రయత్నిస్తారు.

వేదములు రెండు విధములైన ధర్మములు బోధించినాయి. 1. ప్రవృత్తి, 2. నివృత్తి. ప్రవృత్తి లౌకికము. ప్రాకృతమైనటువంటి జీవితమునకు సరిపోవునటువంటి గుణములను చేకూర్చునది. కాని నివృత్తి ఆత్మజ్ఞానమును బోధించునది. ఈ ప్రవృత్తికి, నివృత్తికి ఉండినటువంటి బేధములు గుర్తించినటువంటి వాడే ధీశాలి. ఏపనినైనను ఎలా చేయాలి అనేది ప్రవృత్తి. ఎట్టి స్థితిలో చేయాలనేది నివృత్తి. మానవుడికి ఆకలి వేసిన తక్షణమే భుజించి ఆకలిని తీర్చుకోమని చెప్పడం ప్రవృత్తి. కాని ఎట్టి ఆహారమును భుజించాలి? ఏ విధంగా భుజించాలి? ఏ విధమైన ఆరోగ్యమును చేకూర్చేటటువంటిది భుజించాలి? అనేటటువంటి సరియైన మార్గమును బోధించేటటువంటిది నివృత్తి. కనుక ప్రవృత్తి, నివృత్తుల యొక్క ధర్మములు

## భగవాన్ సాయి దివ్యబోధ

బాహ్యము, అంతరాత్మ ప్రబోధములకు సంబంధించినటు వంటివే. కంటికి కనిపించునది, చెవులకు వినిపించునది, మనసునకు అనిపించునది, హృదయమును కరిగించునది, జీవితమును పండించునది - ఇవియే నివృత్తి మార్గములు. మనస్సును చలింపజేసి, బుద్ధిని భ్రమింపజేసి, నివృత్తి మార్గమునందు ప్రవేశింపకుండా చేయటం ప్రవృత్తి యొక్క ధర్మము. దైవ మార్గమునకు అత్యంత దూరముగా ఉంచునదే ఈ ప్రవృత్తి.

జీవితము ఒక విధమైన సంఘర్షణ. కాని ఎట్టి సంఘర్షణలు లేని స్థానము అదియే అయోధ్య. ఎట్టి విరోధి కూడా ప్రవేశించనటువంటి ప్రదేశము అయోధ్య. అట్టి అయోధ్యయే మానవుని యొక్క హృదయము. ద్వేషము లకు, కళంకములకు, రూపములకు మూలమైనది మానసిక తత్త్వమే. ఘర్షణలతో విరోధమును పెంచుకొని, సంయోగ వియోగములకు గురికావటం ప్రవృత్తి లక్షణమే. కనుకనే మానవుడు ఈనాడు అశాంతికి గురియై శాంతికి దూరమవుతున్నాడు, కారణం? ప్రవృత్తి మార్గమును అనుసరించటం చేతనే, సంయోగ వియోగములకు

గురియై, సర్వకాలములయందునూ అశాంతిని పొందుతున్నాడు. ఇట్టి అశాంతిని పొంది, జీవితమును వ్యర్థము గావించుకొనినవాడే 'రావణుడు'. అతను నిరంతరమూ ప్రవృత్తి మార్గమును అనుసరిస్తూ వచ్చాడు. తన కోరికలను తాను చంపుకోలేక తన కొడుకులనే చంపుకున్నాడు. తన వాంఛలను తాను చంపుకోలేక తన వంశాన్నే నాశనం గావించుకున్నాడు. తన రాగములను తాను చంపుకోలేక తన రాజ్యాన్నే సర్వనాశనం చేసుకున్నాడు రావణుడు. కట్టకడపటికి రావణుడు లోకానికి బోధించినది ఇదియే. లోకప్రజలారా! నా వలె రాగములను జయించుకోలేక, నా వలె వాంఛలను అరికట్టుకోలేక, నావలె కోరికలను చంపుకోలేక సర్వనాశనమునకు గురికాకండి. ఇంతియే కాదు కట్టకడపటికి నేను కూడా ఉండను. ఈ జగత్తులో నిలిచేది ఏమిటి? కీర్తి, అపకీర్తులు మాత్రమే. సత్కీర్తి రామునికి మాత్రమే చెందుతుంది. కనుక సత్కీర్తిని సాధించండి. అపకీర్తికి ఏమాత్రం అవకాశం యివ్వకండి. అని రావణుడు జగత్తుకు బోధించాడు.

పాపాలను కరిగించి, శాపాలను నశింపజేసి, మానవత్వాన్ని అభివృద్ధి పరచేటటువంటిదే రామతత్త్వము. రాముడు కేవలం సామాన్యమానవునివలె సంచరిస్తూ వచ్చాడు. ఆదర్శమును అందిస్తూ వచ్చాడు. రాముడు సామాన్య మానవుడేనని అందరూ భావించారు. కాని సామాన్య మానవులు రామునివలె జీవించలేదే? సామాన్య మానవుని వలె జీవించి, సాలోక్య తత్త్వమును పొందినటు వంటివాడు రాముడు. కనుక ఆదర్శమైనటువంటి ఆధ్యాత్మిక తత్త్వమును నిరూపించినటువంటివాడు రాముడు. కనుకనే ఈనాడు లోకమునకు రామాయణము అత్యవసరము. ఈనాడు తండ్రుల మాటలు బిడ్డలు వినటం లేదు. బిడ్డలకు సరియైన ఆదర్శమును చూపించటం లేదు తండ్రులు. గురువులు శిష్యులకు సరియైన మార్గమును బోధించటం లేదు. శిష్యులు తగిన గౌరవమును గురువులకు అందించటం లేదు. ఈనాడు పాలకులు, పాలితులు, వ్యాపారస్థులు, అధికారులు - అందరూ కలుషితమై ఉన్నారు. కలహములలో మునిగి ఉన్నారు. రామతత్త్వమును మరిచారు, కామతత్వమును మేలుకొలిపారు, జీవతత్వాన్ని నశింపజేశారు, దైవత్వాన్ని విస్మరించారు. కనుకనే ఇన్ని కష్టములకు గురిఅవుతున్నారు మానవులు.

ఈనాడు రాతి రూపంలోనున్న నాగేంద్రుని పూజిస్తున్నారు. ఓ నాగేంద్రా! నాకు ప్రత్యక్షమై నాకష్టములు తీర్చమని ప్రార్థిస్తారు. కాని ఆ నాగేంద్రుడే సజీవంగా ప్రత్యక్షమైనప్పుడు ప్రతిష్ఠించిన ఆ రాతి నాగేంద్రశిలతోనే సజీవ నాగేంద్రుని చంపుతారు. ఆ రాతి నాగేంద్రునికి చక్కెరపాలు నైవేద్యం పెడుతారు. నిజమైన నాగేంద్రుడు ప్రత్యక్షమైతే దానిని చంపటానికి ప్రయత్నిస్తారు.

పంచాక్షరి అయినటువంటి "నమశ్శివాయ" అనే నామంలోపల 'మ' కారం ప్రాణం. వైష్ణవ నామమైనటు వంటి "ఓం నమో నారాయణాయ" అనే అష్టాక్షరిలో 'ర' కారం ప్రాణం. ఈ 'నారాయణాయ'లో 'ర' కారం పోయిందంటే 'నాయణాయ' మిగులుతుంది. అంటే చచ్చినవాడితో సమానమని అర్థం. "నమశ్శివాయ"లో 'మ' కారం పోయిందంటే 'నశ్శివాయ' మిగులుతుంది. శివుడు కానటువంటిది. కనుక 'నారాయణాయ'లో 'రా'

ప్రాణం 'నమశ్శివాయ'లో 'మ' ప్రాణం. ఈ రెండింటి యొక్క చేరికయే 'రామ' అనే నామము. కనుకనే ప్రాణ స్వరూపమైనటువంటిది ఈ 'రామ' నామం. ర,అ,మ - ఈ మూడు అక్షరముల చేరికయే 'రామ'. 'ర' అగ్ని బీజము, 'అ' సూర్యబీజము, 'మ' చంద్రబీజము. ఈ మూడింటియొక్క ఏకత్వమే రామనామం. అగ్ని బీజము మన పాపములను భస్మం గావిస్తుంది. సూర్యబీజము మన అజ్ఞానమనే అంధకారమును దూరం గావిస్తుంది. చంద్రబీజము మన తాపములను చల్లార్చి హాయిని చేకూరుస్తుంది. పాపములు, దుర్మార్గములు, తాపములను చల్లార్చేటటువంటి శక్తి కలదే రామనామం. తన తలంపులు, మాటలు, చేతలు - ఈ మూడింటి యొక్క ఏకత్వమే రామనామం. మానవాకారము ధరించిన రాముడు తన ఆలోచనలు, తన మాటలు, తన చేతల ద్వారా ఈ మూడింటి యొక్క ఏకత్వాన్ని చూపించాడు. కనుక రామతత్వము అనేక విధములైన శక్తి సామర్థ్యము లతో కూడినటువంటిది.

కేవలం పారాయణం చేసేటటువంటిది కాదు రామాయణం. రామ+అయనం = రామాయణం. అనగా రామతత్వమనేటటువంటిది సర్వత్రా ప్రయాణం చేసేటటు వంటిది. సర్వత్రా ఉండినటువంటిదే రామతత్వము, సర్వవ్యాపకమైనటువంటిది రామతత్వము, సర్వజీవ అంతరాత్మనే రామతత్వము. అందుకోసమనే ప్రాచీన కాలమునందు 'నా ఆత్మారాముడుకే తెలుసు అంతా' అనేవారు. ఆత్మకే 'రామ' అని పేరు. రమింపజేసేటటు వంటిదే 'రామ'. రమింపజేసేటటువంటి దివ్యతత్వానికి ఎట్టి రూపం నిర్ణయించగలవు? రామాయణమునందు ఒక విశిష్టమైన దివ్యత్వం ఉంది. ఆ విశిష్టత ఏమిటి? మానవుడు మానవుడుగా జీవించాలి. మానవుడు దైవత్వంతో ఏకం కావాలి. మానవుడియందున్న త్రిగుణముల తత్వాన్ని ఏకత్వం చేయాలి. ప్రతి మానవుని యందు మానవత్వం, దానవత్వం, దైవత్వం - ఈ మూడు ఏకమై ఉంటున్నాయి. కాని ఈనాటి మానవుడు మానవత్వం, దైవత్వమును మరచి కేవలం దానవత్వాన్ని మాత్రమే వహిస్తున్నాడు. కనుక మానవుడు దైవత్వాన్ని నిరూపించాలి కాని దీనత్వాన్ని, దానవత్వాన్ని, నిరూపించ కూడదు.

రాముడు ఆదర్శప్రాయుడు. పితృవాక్య పరిపాలన నిమిత్తమై అరణ్యాలకు వెళ్ళి అనేక విధములైన కష్టములు పడ్డాడు. అయితే ఎవరి బలవంతంతోనయినా పోయాడా? అసంతృప్తితో పోయాడా? అని విచారిస్తే ఇవి ఏమి కావు అని అర్థమవుతుంది. పట్టాభిషేకమునకు రమ్మనమన్నప్పుడు ఎంతటి ఆనందంతో, సంతోషంతో ముందుకు వచ్చాడో, అదే విధమైన ఆనందంతో, సంతోషంతో అరణ్యాలకు వెళ్ళాడు రాముడు. సమత్వాన్ని నిరూపించినటువంటి వాడు రాముడు. సుఖ దుఃఖములను సమంగా చూచినటువంటివాడు రాముడు. దుఃఖమే కనుక లేకపోతే సుఖమునకు విలువే లేదు. దీనినే "నసుఖాత్ లభ్యతే సుఖం" అన్నారు. సుఖమునుంచి సుఖము మనకు చిక్కదు. దుఃఖము నుంచియే మనకు సుఖము చిక్కుతుంది. చీకటి నుంచి వెలుతురు రాదు. వెలుతురు వచ్చినప్పుడే చీకటి దూరమవుతుంది. అసలు చీకటి ఉండినప్పుడే వెలుతురు ప్రకాశిస్తుంది. చీకటే కనుక లేకపోతే వెలుతురుకు ఏమాత్రం ప్రకాశం లేదు. అదే విధంగా దుఃఖమే కనుక లేకపోతే సుఖమునకు ఏమాత్రము విలువ లేదు. కనుక సుఖమనేటటువంటిది దుఃఖము ద్వారా మనకు లభించేటటువంటిదే కాని సుఖము నుంచి సుఖము లభించదు. ఇట్టి పవిత్రమైన ఆదర్శమును జగత్తుకు చాటి నిరూపించాడు. ప్రతి ఒక్కదానిని తాను ఆచరించి, ఆదర్శంగా నిరూపించాడు. వ్యక్తి ధర్మము, కుటుంబ ధర్మము, సమాజ ధర్మము - ఈ మూడు ధర్మములను తాను అనుభవించి, నిరూపించాడు.

మొట్టమొదటి వ్యక్తి ధర్మమును సాధించాలి. అసలు వ్యక్తి అనగా ఏమిటి? అవ్యక్తమై, నిగూఢంగా ఉన్నటువంటి దివ్యత్వాన్ని ఎవరు వ్యక్తీకరింప జేస్తాడో అతను మాత్రమే వ్యక్తి. ఆకారమును ధరించినటువంటి వాడు మాత్రమే వ్యక్తి కాదు. రాముడు వ్యక్తిగా ఉంటుండి తనయందున్నటువంటి దివ్యశక్తిని నిరూపించి, పవిత్రమైన ఆదర్శమును నిరూపించాడు, ఆదర్శంగా ఆచరించాడు. అందువలననే రామతత్వమనేది పర్వతములు, నదులు

ఉండినంతవరకు నిలిచి ఉంటుందని బ్రహ్మవాక్కు. రామాయణమనేటటువంటిది పర్వతములు నదులకు సంబంధించినటువంటిదా? కాదు.... కాదు.... బ్రహ్మ యొక్క భావం అది కాదు. పర్వతములు అనగా పురుషులు. నదులు అనగా స్త్రీలు. స్త్రీ పురుషులు ఉండినంత వరకు రామయణం ఈ జగత్తులో నిలిచి ఉంటుందని బ్రహ్మ అభిప్రాయం. అసలు స్త్రీలు, పురుషులు లేకుండా ఈ జగత్తు ఉండనే ఉండదు. కనుక రామాయణం లేకుండా ఉండడానికి సాధ్యం కానేకాదు. ఇలాంటి సత్యమైన, నిత్యమైన రామతత్త్వమును గ్రహించ డానికి తగిన శక్తి సామర్థ్యములు సంపాదించుకోవాలి.

ఈనాడు రాముని జన్మదినం. మనం ఏం చేస్తున్నాం? ప్రత్యేక పూజలు చేస్తున్నాం, బొట్టు పెట్టుకుంటున్నాము. ఈ పని చేయటానికి ప్రత్యేకంగా జన్మదినాలు రావాలా? కాదు... కాదు.... ఏ వయస్సు అయినప్పటికినీ నిత్యమూ, "సర్వదా, సర్వకాలేషు, సర్వత్రా రామచింతనం" అన్నారు. వాల్మీకి రామాయణం వ్రాసిన తరువాత శిష్యులందరినీ సమావేశపరచి "ఈ పవిత్రమైన రామాయణ కథను వీధి వీధినా చాటేవారెవరు?" అని ప్రశ్నించాడు. ఎవ్వరూ ముందుకు రాలేదు. వాల్మీకి నిరుత్సాహపడ్డాడు. ఇంతలో లవకుశులు ముందుకు వచ్చి ఈ కార్యమును నిర్వహిస్తామని చెప్పి నామములు పెట్టుకొని, తంబూర చేబట్టి, చిడతలు చేబూని వీధి వీధిన రామకథను రమ్యంగా పాడుతూ వెళ్ళారు. ఈవిధంగా ఈనాడు ఎవరైనా చేయగలరా? ఈనాడు భజనకు పోయి గట్టిగా పాట పాడాలంటే చాలామందికి భయం, బిడియం. "ఈయన భజన కూడా చేస్తాడా!' అని గేలిచేస్తారని భయం. విభూతి పెట్టుకొని బయటకు వెళ్లితే "ఈయన సాయిబాబా భక్తుడా!' ' అంటారేమోనని భయం. ఇలాంటి అభిమాన మమకారాలకు లోనవు తున్నారు ఈనాటి మానవులు. అభిమాన మమకారములను మనం ఏనాడు త్యాగం చేస్తామో ఆనాడే సమాజంలో సౌభాగ్యం విలసిల్లుతుంది. కనుక ఈ అహంకార, అభిమాన మమకారములను మనం త్యజించాలి. ఇవి ఉండినంత వరకునూ భగవన్నామమును కూడా మనం స్మరించ లేము. ఎవరు ఏమనుకుంటారోనని భయమెందుకు? ఎన్ని పనులు చేయరానివి చేస్తున్నారు. వీటికి భయం లేదే? పవిత్రమైన భగవన్నామమును స్మరించడానికి, భజనలు చేయటానికి, పదిమందికి భగవత్ విషయాలను బోధించడానికి ఎందుకు భయం? తప్పుచేస్తే భయపడాలి గాని, మంచి చేయటానికి భయపడనవసరం లేదు. పాపకార్యాలు చేసేవారు భయపడాలి కాని, పుణ్య కార్యాలు చేసేవారు భయపడనవసరం లేదు. అయితే ఈనాడు చాలామందికి పాపభీతి లేదు, దైవ ప్రీతి అంతకన్నా లేదు. ఇంకా మనలో త్యాగం ఏవిధంగా వస్తుంది? అయితే ఈనాడు భోగాలు అనుభవించడానికి ముందుకు వస్తున్నారు గాని త్యాగం చెయ్యడానికి వెనుకాడుతున్నారు. భోగమే రోగము. కాని ఈనాటి మానవులు రోగములకు గురి అవుతున్నారు కాని, త్యాగములకు మాత్రం సిద్ధం కావటం లేదు. ఎవరైనా ఏమైనా అనుకోని "త్యాగేనైకే అమృతత్వ మానశుః". అమృతత్వాన్ని, భుజించాలంటే త్యాగమునకు సిద్ధం కావాలి. చక్కగా నమిలినప్పుడే చెరుకులోని రసమును మనం ఆస్వాదించగలుగుతాం. అదే విధంగా కష్టపడి నప్పుడే సుఖం మనకు ప్రాప్తిస్తుంది. క్రమ క్రమ రాపిడి చేసినప్పుడే అగ్ని ఆవిర్భవిస్తుంది. చిలకంగా చిలకంగా వెన్న వస్తుంది. అదే విధంగా భగవన్నామం స్మరించగా,

స్మరించగా దివ్యత్వం మనలో ఆవిర్భవిస్తుంది. స్మరించ కుండా దివ్యత్వం మనలో ఆవిర్భవించడానికి అవకాశమే లేదు. రెండు కర్రలను రాపిడి చేసినప్పుడే అగ్ని ప్రవేశిస్తుంది. ఆ అగ్నియే సాక్షాత్ జ్ఞానము. దీనినే రామాయణము నందు "జ్ఞానాగ్ని" అని బోధించబడింది. ఈ అగ్ని అనేది ఎవనియందు ఆవిర్భవించునో, వానియందు పాపములు ఏమాత్రం ఉండవు. కొండల వంటి పాపములను అణుమాత్రమైన నిప్పు భస్మం చేస్తుంది. కనుక ఏనామం తలిచినా, హృదయ పూర్వకంగా తలచినప్పుడు, దానియొక్క ఫలితం మనకు లభిస్తుంది. అయితే ఈనాడు నామం స్మరిస్తున్నామే గాని, హృదయ పూర్వకంగా లేదు. ప్రాకృతంగా భజనలు చేస్తున్నాం, నామం స్మరిస్తున్నాం కాని హృదయంతో చేయటం లేదు. ఇవి సరియైన ఫలితాన్ని అందించవు.

"చిత్తశుద్ధిలేని శివపూజలేలరా!" ప్రతి పని చిత్తశుద్ధితో చేయాలి. చిత్తశుద్ధి లేకుండా చేస్తే ఏమాత్రం ఫలితం రాదు. రామాయణం అనేకవిధములైన ఆదర్శములను అందిస్తూ వచ్చింది. తాను సాక్షాత్ నారాయణుడు అయినప్పటికినీ, సామాన్య నరుడివలె ప్రవర్తిస్తూ వచ్చాడు రాముడు. కైక కోరిక ప్రకారం, తండ్రి ఆజ్ఞానుసారం అరణ్యాలకు బయలుదేరి వెళ్ళేముందు, సీత వద్దకు వెళ్ళి తాను పట్టాభిషేకమునకు ధరించిన వస్త్రములను త్యజించి, నారబట్టలను ధరించి తల్లి కౌసల్య వద్దకు వచ్చి "అమ్మా! నీకు ఆనందమైనటువంటి ఒక వార్తను చెప్పటానికి వచ్చాను. నేను ఇప్పుడు అయోధ్యకు కాదు రాజును. అరణ్యాలకు రాజును. ఈ క్షణమే బయలుదేరి వెళ్ళుతున్నాను." అని చెబుతాడు. ఇంతలో లక్ష్మణుడు వచ్చి జరిగినదంతా చెబుతాడు. కౌసల్య తూలిపడిపోయి, లేచి "ఓరామా! నిన్ను వదలి నేను క్షణమైనా ఉండలేను. నీవు తండ్రి ఆజ్ఞ శిరసా వహించినావు. నేను కాదని చెప్పను. కాని నన్ను కూడా నీ వెంట తీసుకొనిపో!" అంటుంది. అప్పుడు చెబుతాడు రాముడు "సతికి పతియే దైవము. కనుక నీవు నీ పతి (దశరథుని)ని వదలి రావటానికి వీలు లేదు. పతియే నీ సర్వస్వము. అతను జీవించి ఉన్నంతవరకు అతనిని వదలటానికి వీలులేదు. అతనిని సేవించు. నా వియోగం వలన అతను దుఃఖములో మునిగి పోయినాడు. కనుక నీవు ఉండి, అతనికి తగిన సపర్యలు చేస్తూ శాంతిని బోధించు!" అని హితము పలికాడు. వెంట వచ్చిన సీత ఈ పలుకులు విని ఫక్కున నవ్వింది. "రామా! నాకొక బోధ, నీ తల్లికి ఒక బోధన! నేను నీ వెంట వస్తానంటే రావద్దని చెప్పావు. నీ తల్లి దగ్గరకు వచ్చేటప్పటికి పతియే దైవము అంటున్నావు. నాకు మాత్రం పతి దైవము కాదా? ఒక స్త్రీకి ఒక ధర్మము, మరొక స్త్రీకి మరొక ధర్మమా? నేను అంగీకరించను" అన్నది. అంతేకాక "నీవు రామచంద్రుడివి! నీవు చంద్రుడివి. నేను శీతలముతో ఉండిన వెన్నెలను. చంద్రుడు అరణ్యములో, శీతలము అయోధ్యలో ఉండటానికి వీలవుతుందా? చంద్రుడెక్కడో, దాని చల్లదనంకూడా అక్కడనే ఉండాలి. కనుక Moon and Moon Light రెండూ కూడనూ ఏకంగా ఉండాలి. కనుక నన్ను కూడా నీవెంట తీసుకొనిపోవాలి" అన్నది సీత. ఈ విధంగా తల్లులకు, భార్యకు సరియైన సమాధానం ఇస్తూ, శాంతింప చేస్తూ వచ్చాడు. ఇదియే కుటుంబ ధర్మము.

ఒక్కొక్క సమయంలో సందర్భోచితంగా కొన్ని యుక్తులను కూడా పన్నవలసి వస్తుంది. యుక్తి అనగా ఇది ఒక రకమైన రాజమార్గము. పరులను మోసగించేటటు వంటిది కాదు ఇది. ఆదర్శముగా నిరూపించేటటువంటిది ఇది. కనుకనే ఇది యోగంగా మారిపోయింది. " యోగః చిత్త వృత్తి నిరోధకః" వారికున్నటువంటి దుఃఖములకు నివారణ గావించే నిమిత్తమై ఇది ఒక యోగంగా మారిపోయింది. ఈవిధంగా తల్లులను సమాధానపరచి, కుటుంబ గౌరవాన్ని నిలబెట్టుటకు అరణ్యాలకు వెళ్ళాడు రాముడు. అక్కడ జరుగుతున్న రాక్షస కృత్యములను చూచి, వారిని అణచివేసే నిమిత్తమై తనను అరణ్యాలకు తన తండ్రి పంపించి ఉంటాడని భావించాడు రాముడు. అంతేకాదు ఋషులు చేసే తపస్సులకు అడ్డుతగులుతున్న రాక్షసులను సంహరించి, యతుల సాధనలకు అడ్డం లేకుండా రాక్షసులను తప్పించే నిమిత్తమై తనను అడవులకు తన తండ్రి పంపించి ఉంటాడని భావించాడు

గాని, తన తండ్రిపైన ఏమాత్రం కోపించలేదు రాముడు. అయితే ఈ రాక్షసులను సంహరించే సమయంలో ఒక చిన్న అనుమానం వచ్చింది రాముడికి. స్త్రీలైన రాక్షసులను సంహరించవచ్చునా? అనే అనుమానం పూర్వం కూడా వచ్చి విశ్వామిత్రుని అడుగగా "ఋషులుచేసే సాధనలకు, తపస్సులకు అడ్డం వచ్చేవారు ఎవరైనా సరే, వారుస్త్రీలు అయినా సరే చంపవచ్చును'' అని చెబుతాడు విశ్వామిత్రుడు. అందువలననే ఆనాడు తాటకిని చంపాడు. తరువాత శూర్పణఖ ముక్కు, చెవులు కోశాడు. వారు ఎవరైనా సరే దైవత్వానికి అడ్డు తగిలిన వారిని చంపవచ్చును. అందులో ఏమాత్రం తప్పు లేదు.

మాతృదేవోభవ! పితృదేవోభవ! ఆచార్యదేవోభవ! వీరందరూ దైవస్వరూపులే. వీరిని పూజించాల్సిందే. ఇది సామాన్య ధర్మము. కాని దైవానికే అడ్డు తగిలినప్పుడు తల్లి అయినా సరే, తండ్రి అయినా సరే, గురువు అయినా సరే ఎవరైనా సరే వారిని త్యజించవచ్చును. దైవమైన శ్రీరామచంద్రుని అడవులకు పంపించినందులకు తన తల్లిని తూలనాడాడు భరతుడు. హరిద్వేషి అయిన తండ్రిని వదిలాడు ప్రహ్లాదుడు. వామనుడు వచ్చి దానం అడుగగా యిస్తానని ఒప్పుకున్నాడు బలిచక్రవర్తి. గురువైన శుక్రాచార్యుడు రానున్న ఆపదను గురించి హెచ్చరించి నప్పటికినీ వినక గురువాజ్ఞను ధిక్కరించి, దైవానికి యిచ్చిన వాగ్దానమును నిలబెట్టుకున్నాడు బలిచక్రవర్తి. భగవంతుని కోసం తల్లిని తూలనాడుతే భరతుడు, తండ్రిని విడనాడాడు ప్రహ్లాదుడు, గురువుకు దూరమైనాడు బలిచక్రవర్తి. భగవంతుని విషయంలో ఏ తప్పునూ పట్టటానికి వీలు లేదు. సర్వసంగపరిత్యాగి అయినటువంటివాడే నిజమైన భక్తుడు. అన్నిటికంటే గొప్పవాడు దైవమే. దైవమునకు మించినది మరొకటి లేదు. దాని కోసం మనం సర్వమునూ అర్పించవచ్చును.

ప్రతి మానవుడు తన సంకల్పాలను పవిత్రమైన సంకల్పాలుగా పెట్టుకోవాలి. దైవభావములను అభివృద్ధి పరచుకోవాలి. అన్నీ దైవము యొక్క ఆజ్ఞలేనని భావించి, సమత్వంగా తీసుకొని, రామతత్వాన్ని విశ్వసించి, రామ మార్గమును అనుసరించినప్పుడు మీరు రమించినటువంటి దైవత్వంగా రూపొందుతారు. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' ఏ దైవాన్ని నీవు స్మరిస్తుంటావో, ఆ దైవంగానే నీవు రూపొందుతావు.

దైవము మనిషి రూపంలోనే రావాలి. ఎందువలన అంటే మనుష్యులకే బోధించాలి. పశుపక్షి మృగాదులు కాలానుగుణ్యముగా ప్రవర్తిస్తున్నాయి. తమ ప్రాకృతమైన ధర్మాన్ని అనుసరిస్తున్నాయి. కాని మనిషి మాత్రం ప్రకృతి సంబంధమైన ధర్మానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడు. సృష్టికి అనుగుణంగా నడిచేటటువంటి వారిని దైవము కూడా క్షమిస్తాడు. కనుక పశుపక్షి మృగాదులను హింసించడానికి రాలేదు భగవంతుడు. కనుక పశుపక్షి మృగాదులు తమ Season ను తమ Reason ను తప్పకుండా పాటిస్తున్నాయి. కాని మానవుడు దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడు. కనుక ఈ విరుద్ధంగా ప్రవర్తించేవాడిని శిక్షించడానికే వస్తున్నాడు భగవంతుడు. శిక్షించడం అంటే బాధించడం కాదు. సక్రమమైన మార్గమును బోధించడం, ఆదర్శవంతమైన జీవితాన్ని అందించడం, నవ్యమైన జీవితాన్ని పోషించడం.

ప్రేమ స్వరూపులారా!

భగవంతుడు కేవలం లోకోద్ధారణ నిమిత్తమై వచ్చేవాడే కాని, తన నిమిత్తమై తాను వచ్చేటటువంటివాడు కాదు. తనకేమి కావాలి? ఏమీ అవసరం లేదు. సర్వమూ తన హస్తమునందే ఉంటున్నది. కనుకనే దైవం మానవా కారంలో వచ్చి మానవులను ఉద్ధరించి, జగత్తునంతా ధర్మమయంగా మారుస్తూ వస్తున్నాడు. ఇదే మనం ఈనాడు తెలుసుకోవలసింది. ఈరోజు శ్రీరామనవమి కాబట్టి ఈ ఒక్క దినం మాత్రమే పూజలు సలిపి, ఈ ఒక దినం మాత్రం పాయసం, పరమాన్నములు తింటే ప్రయోజనం లేదు. క్షణ క్షణమూ భగవంతుని చింతన చేస్తూ రావాలి. ఈ విధంగా చింతన చేసినప్పుడే, స్మరణ చేసినప్పుడే దివ్యత్వమనేది మనకు సాక్షాత్కరిస్తుంది. కనుక ఎవరివరి కర్మ ధర్మాన్ని వారు ఆచరిస్తూ రావాలి. "ధర్మో రక్షతి రక్షితః, ధర్మ ఏవహతోహన్తి" కనుక మనం ధర్మాన్ని రక్షించాలి. మానవ ధర్మాన్ని రక్షించాలి. నీవు మానవుడవు కాదు, మాధవుడివే. కనుక నీ మాధవత్వాన్ని

నీవు పెంచుకో, దైవత్వాన్ని అభివృద్ధి గావించుకో.

ఈ రామతత్త్వమనేది ఎన్ని విధాల వర్ణించి నప్పటికినీ సాధ్యం కాదు. ఎన్నో తరతరాల నుంచి ఈ రామనామం వస్తూనే ఉన్నది. లక్షల లక్షల సంవత్సరాల క్రిందటే ఈ మానవుడు ఉద్భవించాడు. అయినప్పటికి మానవత్వమంటే ఏమిటో తెలుసుకోలేకపోతున్నాడు ఈ మానవుడు. మానవాకారం ధరించామే గాని మానవత్వమును గుర్తించడానికి ప్రయత్నించడం లేదు. మానవత్వమును గుర్తించనప్పుడు మానవుడుగా పుట్టి ప్రయోజనం ఏమిటి? అసలు మానవత్వమంటే ఏమిటి? అదియే ప్రేమతత్త్వం. ఈ ప్రేమను పదిమందికి పంచాలి. నిరంతరమూ మనం ప్రేమతోనే జీవించాలి. ప్రేమతోనే మన దేహమును వదిలిపెట్టాలి. కంటినీటితో కాదు, ఆనంద భాష్పములతో వదలాలి. ఇదే మానవత్వం యొక్క ప్రధాన లక్ష్యం. ఈ పవిత్రమైన శ్రీరామనవమి దినమును నిరంతరమూ స్మరించుకుంటూ మన జన్మను సార్థకం చేసుకోవాలని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ, నా ప్రసంగమును విరమిస్తున్నాను.

(ది. 5-4-1998 శ్రీరామనవమి పర్వదినమున భగవాన్ సాయి బృందావన్ (బెంగుళూరు)లో చేసిన దివ్య ప్రసంగం నుండి)

---

## శ్రీ సత్యసాయి

సత్యమావిరగును సద్ధర్మమేఘము
ప్రేమరసము వర్షబిందువులగు
అట్టి బిందు సమితి ఆనందవాహిని
శరణమీవెస్వామి సత్యసాయి

నటకుడైన యట్టినాగయ్య, త్యాగయ్య
అనెడి వేషమునను అభినయించు
అసలు చూడనొకడె త్యాగయ్య నాగయ్య
శరణమీవె స్వామి సత్యసాయి

దైవమైన తానె దర్శకుండు నటుడు
జీవుడేననియెడి భావమెడల
భ్రాంతి తొలగినపుడె బ్రహ్మంబు గాన్పించు
శరణమీవె స్వామి సత్యసాయి

ప్రేమికుండు లేక ప్రేమయే యుండదు
రెండుపీడకుండనుండు గలసి
పూవుతావివోలె దేవుడు జీవుడు
శరణమీవె స్వామి సత్యసాయి

హైటు, వెయిటు నెరుగ వ్యక్తిత్వమెరుగము
కొన విలువ గాదు రూపు, ముఖ
మమల సద్గుణాలె అగుచుండు వ్యక్తియు
శరణమీవె స్వామి సత్యసాయి

అష్టవక్రుగాంచి యందరు నవ్వగా
అతడు వారి గాంచి యపహసించె
సామ్యదృష్టి లేని చర్మకారులటంచు
శరణమీవె స్వామి సత్యసాయి

అన్ని రూపములను అతడేమటంచును
రామ,కృష్ణ యనెడి ప్రార్థనాన
అణువె దైవరూపమని నమ్మిటే గొప్ప
శరణమీవె స్వామి సత్యసాయి

దేవుగూర్చి యేమి తెలియని వారితో
వాదమాడుడెల్ల వ్యర్థమగును
సత్యమనుసరించి సాయీశుదర్శింప
శరణమీవె స్వామి సత్యసాయి

పాత్రవంటి హృదిని బంచదారనుబోలు
'డివినిటీ' ని జేర్చనవును మధుర
సాధనయును గాన సాయినామము సేయ
శరణమీవె స్వామి సత్యసాయి

'శ'యను దాని కొమ్ము సంహరించినయంత
'అహము' తొలగ్రిదాననగును శివము
గాననడపవలయుగా నహంకారమ్ము
శరణమీవె స్వామి సత్యసాయి

- గుమ్మడి సీతారామయ్య

# యుద్ధతంత్రంలో సూక్ష్మజీవులు

ఆధునిక కాలంలో విజ్ఞాన శాస్త్రం అవధులు లేకుండా విస్తరిస్తోంది. ఇందుమూలంగా ఒక వైపున ఎన్నో సత్ఫలితాలు సమకూరుతున్నా మొత్తం మానవాళినే స్వల్పకాలంలో మటుమాయం చేయగల ధోరణులు చాప క్రింద నీరులా చోటుచేసుకుంటున్నాయి. అణ్వస్త్రాలు కల్పించగల ప్రమాదం అందరూ ఎరిగినదే. దీనిని మించి శత్రుదేశంలోని సర్వప్రాణులకూ విపరీతమైన హాని కల్పించ గల సూక్ష్మజీవులను ప్రయోగించే ప్రయత్నాలను అగ్రరాజ్యాలు చేస్తున్నాయి.

యుద్ధతంత్రంలో సూక్ష్మజీవులను వినియోగించే ప్రయత్నాలు ప్రప్రథమంగా 1930 ప్రాంతంలో ప్రారంభమయ్యాయి. రెండవ ప్రపంచ యుద్ధంలో ఈ ప్రయత్నాలు ముమ్మరమయ్యాయి. మానవులకూ, జంతువులకూ, పంటలకూ, వృక్షాలకూ హాని కల్పించే సూక్ష్మజీవులను, వైరస్‌లను, ఫంగస్‌లను సృష్టించి శత్రు దేశాల మీద ప్రయోగించడం ఈ పరిశోధనల లక్ష్యం. ఇటువంటి వాటిని "జీవాస్త్రాలు" (బయోలాజికల్ వెపన్స్) అంటారు. 1940లో జర్మనీ ఈ రంగంలో పరిశోధనలు చేస్తోందని తెలిసి బ్రిటన్ కూడా పెద్ద యెత్తున ఇటువంటి ఆయుధాలను తయారుచేయడానికి ప్రణాళికలను రూపొందించింది. అయితే వనరుల కొరత వల్ల వాటిని ఆచరణలో పెట్టలేక ఆ బాధ్యతను అమెరికాకు అప్పజెప్పింది. అమెరికా ప్రధానంగా "రాచపుండు" (కార్బన్‌కిల్)ను కల్పించే "ఆంథరాక్స్ బాంబ్"లను సృష్టించడంలో దృష్టిని కేంద్రీకరించింది. ప్రతి నెలా యాభై వేల బాంబులను తయారుచేసి బ్రిటన్‌కు అప్పగించ సాగింది.

జపాన్‌వారు తాము సృష్టించిన "బయోలాజికల్ వెపన్స్"ను తాము పట్టుకున్న రష్యా, చైనా బందీలమీద ప్రయోగాలు చేశారు. ప్లేగ్, టైఫాయిడ్, కలరా, డిసెంట్రీ, గాంగ్రీన్, టులరేమియా, బ్రూసిలోసిస్, ఆంథరాక్స్, హెమరేజిక్ ఫీవర్, స్మాల్‌పాక్స్ వంటి అనేక వ్యాధులను కల్గించే సూక్ష్మజీవులను వారు సృష్టించి, ఆ ఖైదీలపై ప్రయోగశాలల్లో గినీపిగ్స్ మీద ప్రయోగాలు చేసే విధంగా ప్రయోగించి చూశారు. ఈ మారణహోమంలో అసంఖ్యాక ఖైదీలు భయంకరమైన నరకయాతన అనుభవించి దుర్మరణం పొందారు. ఈ సూక్ష్మజీవులు ఖైదీల దేహాంతర్గత భాగాలపై ఏవిధంగా పని చేశాయో తెలుసు కోవడానికి ఎందరో ఖైదీలకు మార్ఫిన్ ఇంజక్షన్లు ఇచ్చి బలవంతంగా చంపారు.

**కె.ఆర్.కె. మోహన్**

రెండవ ప్రపంచ యుద్ధం ముగియడంతో ఇట్టి దారుణమైన పరిశోధనలకు తెరదించడం జరిగింది. అయితే కొంతకాలం తరువాత ప్రపంచాధిపత్యం కోసం పోటీపడే అమెరికా, రష్యాలు ఈ పరిశోధనలకు ప్రయోగాలను పునఃప్రారంభించాయి. అమెరికా పంటలను నాశనం చేసే ప్రయోగాలను చేపట్టింది. ఫలితంగా వరి తెగులు, గోధుమ తెగులు, బంగాళాదుంప తెగులువంటి వాటిని సృష్టించింది. ఇంక జంతువులకు వ్యాధుల్ని కల్పించేవాటిలో "ఫుట్ అండ్ మౌత్", రిండర్ పెస్ట్, వార్ట్ వాగ్ డిసీజ్, ఫౌల్ పెస్ట్, హాగ్‌కలరా" మొ॥నవి ఉన్నాయి. ఇంక ఈ సూక్ష్మజీవులను మోసుకుపోయే కీటకాల సృష్టికూడా ఘనంగానే జరిగింది. ఇటువంటి వాటిని "వెక్టార్స్" అంటారు. అమెరికాలోని "ఫోర్ట్‌డెట్రిక్"లో ఈ సూక్ష్మజీవులను మోసుకువెళ్ళే 8 లక్షల దోమలు నెలనెలా ఉత్పత్తి కాసాగాయి. "ఎల్లోఫీవర్", 'మలేరియా' వంటి వ్యాధుల్ని కల్పించే సూక్ష్మజీవుల్ని ఈ దోమల ద్వారా పంపుతారు. అలాగే కలరా, డిసెంట్రీ, ఆంథరాక్స్ వంటి వ్యాధుల్ని కల్పించే ఈగలను కూడా ఇక్కడ ఉత్పత్తి చేయసాగారు.

ఇవన్నీ ఒక ఎత్తు. మనుష్యులకు విపరీతమైన ప్రాణహాని కల్పించే విషాల్ని తయారుచేయడం వేరొక యెత్తు. కొన్ని రకాల సూక్ష్మజీవులనుంచి వీటిని తయారు చేస్తారు. ఉదాహరణకి "సి.బొటు వినియం" అనే బాక్టీరియా నుంచి "బొటులిన్ టాక్సిన్" అనే విషాన్ని తయారు చేశారు. దీనిని మించిన విషం ఈ భూ ప్రపంచంలో వేరొకటి లేదు. కేవలం 28 గ్రాముల ఈ విషం ప్రపంచంలోని సర్వ మానవాళినీ సంహారం చేయగలదు. ఇలాగే 'కేస్టర్ బీన్స్' (ఆముదాలు) నుంచి తయారు చేసిన 'రైసిన్' షెల్‌ఫిష్ నుంచి తయారుచేసిన "సాడ్‌టాక్సిన్"లు కూడా పరమ భయంకరమైనవి. అత్యంత ప్రాణాంతకమైనవి. అయితే ఈ బయోలాజికల్ వెపన్స్‌ను ప్రయోగించడంలో ఎన్నో చిక్కులున్నాయి. వీటిలో అధికభాగం కొన్ని నెలలకంటే ఎక్కువ నిలువ ఉండవు. పైగా వీటిని నిలువ ఉంచడం కూడా పెద్ద సమస్య. వాతావరణ పరిస్థితులు అనుకూలంగా ఉండకపోతే వీటి ప్రభావం కూడా ఆశించిన మేరకు ఉండదు. ఏదైనా పొరపాటు జరిగితే ఇవి "భస్మాసుర హస్తం" లాగా ప్రయోగించిన వారి మీదికే ఎదురుతిరగ వచ్చు. ఈ సూక్ష్మజీవుల సృష్టిలో కొత్త వైరస్‌లు ఉత్పత్తి అయి ఊహించని హానిని కల్పించవచ్చు.

ఈ బయోలాజికల్ వెపన్స్ తీసుకురాగల భయంకర పరిణామాలను గుర్తించి 1975లో అంతర్జాతీయ నిషేధ సంఘం వీటి ఉత్పత్తి, వినియోగాలపై ఆంక్షలు విధించింది. అయితే అగ్రరాజ్యాలు పెద్దగా పట్టించుకున్న దాఖలాలు లేవు. అందుకు బదులుగా అమెరికాలో ఈ అస్త్రాలను ఎదుర్కొనగల టీకాల ఉత్పత్తి, ఇతరులు ప్రయోగిస్తే ముందుగానే పసికట్టగల విధానాలకు రూపకల్పన వంటి వాటిపై పరిశోధనలు ముమ్మర మయ్యాయి. వివరాలు తెలియకపోయినా రష్యాలో కూడా ఇట్టి పరిశోధనలు పెద్ద యెత్తునే జరిగాయి. ఇవన్నీ ఆందోళన కల్గించే విషయాలే. మూడవ ప్రపంచ యుద్ధం కనుక వస్తే అది రోజులు, నెలలూ, సంవత్సరాలూ సాగదు. కేవలం కొద్ది నిమిషాలలో మానవాళి యావత్తూ కోలుకోలేని రుగ్మతలకు లోనై దారుణ మరణాలకు గురి అవుతుంది. ఆ యుద్ధవివరాలను తెలియజెప్పే చరిత్రకారుడు కూడా మిగలడు.



## క్రోధం

ఓ మనిషీ
నీ విశాల ముఖ మైదానంలో
కోపాన్ని మొలిపించకు
ఎందుకో తెలుసా
కోపం ఆవహించగానే
నీ సుందర ముఖారవిందం
మోడుబారిన బీడుగా మారుతుంది.
మెదడు పొరల పొలాల్లో
జ్ఞాపకాల బీజాలు
అంకురించకుండానే అంతరించి పోతయ్
అవకాశాల అందలాలు
అందినట్టే అంది
అందకుండా పోతయ్
నిన్నొక బికారిగా
అనాకారిగా చేసి
ఈ ప్రపంచానికి పరిచయం చేస్తుంది
అసూయా ద్వేషాలు
ఆగ్రహానికి అన్నదమ్ములు
ఇవి ఆగ్రహాన్ని రెచ్చగొడ్తయ్
రెచ్చిపోయిన ఆగ్రహం
ఉచ్చనీచాలు మర్చిపోతుంది
అంతే..... నరాల్లో రక్త ప్రవాహం పెరిగి
గుండె జబ్బుకు గురౌతుంది
అకాల వృద్ధాప్యం క్రోధానికి ఆదిపర్వమైతే
మరణం స్వర్గారోహణ పర్వం
అందుకే ఓ మనిషీ
కోపాన్ని దరిచేరనీయకు
అది శోకానికి శ్రీకారం
పాపానికి ప్రతిరూపం
ఇప్పుడే ఈ క్షణమే
కోపానికి సమాధికట్టు
ఆనందానికి ఆహ్వానం పలుకు

- పాటిబండ్ల శ్రీమన్నారాయణ

# భగవంతుడు భారతావనిలో అవతరించాడు

## అమెరికన్ దంపతుల వైదిక వివాహం :

ముందు ఏమి చెప్పకుండగనే ఆశ్చర్యంగా, నాకు హిందీవచ్చునన్న విషయం తెలిసి నన్నులేవమని తన ప్రక్కన బాబా కూర్చుండబెట్టుకొని తాను హిందీలో తెల్పెడి విషయాల్ని ఆంగ్లంలోనికి తర్జుమా చేయమన్నారు. నాకు తోచిన రీతిని చేశాను.

నేను బాబాను ఆనుకునే కూర్చున్నాను. బాబా నా ఎడమ భుజముపై ఎంతో ఆప్యాయతతో ఒరిగినారు. ఆయన తన కుడిచేతితో నన్ను తరచు స్మరించుచున్నారు. ఆయన చేతిలో గుండుసూదిఉన్నా నాకు తగులుతుంది.

అమెరికన్ దంపతులకేసి చూచి బాబా"ఇది మీ 33వ వివాహదినోత్సవముకదా అని వారిని (Mr.& Mrs. Krystal) ప్రశ్నించారు. వారు నివ్వెరపడి అవునని బదులు చెప్పారు. బాబా "మీ వివాహాన్ని వైదిక విధానంలో ఆధ్యాత్మికపరంగా ఇప్పుడు జరుపుతాను" అని తెల్పారు. ఏదో ఒక అద్భుతం జరుగబోతున్నదని అందరమూ ఎంతో శ్రద్ధగా చూస్తున్నాము. బాబా చేతులు పైకెత్తి బాబా చిత్రముగల ఉంగరాన్ని గాలినుంచి తీసి భార్యతో ఆ ఉంగరాన్ని భర్తవ్రేలికి ధరింప చేయమన్నారు.

తదుపరి ఆ భార్యభర్తలను లేచి అందరికీ కనపడేలాగున వెనుక కూర్చుండమన్నారు. తదుపరి బాబా చొక్కాచేతులు పైకిలాగారు. అవి అందరికీ మామూలు చేతులుగా కన్పించాయి. ఈసారి చేతులు ఆకాశంలో ఊపకుండ ఎడమ అరచేయి పైకిపెట్టి అందరూ చూస్తుండగా అరచెయ్యి మూశారు.

అందరూ నిశ్శబ్దంగా ఉన్నారు. నేను బాబాకు ఎదురుగా కూర్చున్నానుగనుక బాబా పిడికిలిలో ఏదో తళతళ లాడుతున్నట్లు కనిపించింది. కుడిచేతితో బాబా ఎడమచేతినుండి పొడవైన, తళతళ మెరిసిపోయే సుమారు 30 అంగుళాల పొడవుగల నెక్లెస్ (మంగళసూత్రం) బయటకి తీశారు. అంత పెద్ద నెక్లెస్ నిజానికి పిడికిలిలో పట్టటం చాలా కష్టం.

మేమంతా ఈ మహాత్మ్యాన్ని చూచి స్తబ్దులమైపోయాము. అంతా మా కళ్ళ ముందే జరగటం వలన నిశ్చేష్టులమైనాము.

బాబా ఆ నెక్లెస్‌లోని 40మణుల ప్రాధాన్యత గూర్చి వివరించారు. అందులో వజ్రాలు కూడా ఉన్నవి. దాని మధ్య కమలము, అందులో బాబా బొమ్మ ఉన్నవి.

మూలం : ఆర్.కె. కరంజియా
అనువాదం : డా॥ రాపర్ల జనార్థనరావు

ఆ మంగళ సూత్రాన్ని భర్తకు ఇచ్చి దానిని భార్యమెడలో ధరింపజేయమన్నారు.

ఆశ్చర్యచకితులైన అందరిని చూచి బాబా ఇది "ఇది ఎలా సంభవించినదో చెప్పండి" అని అడిగారు. ఎవరూ సమాధానం చెప్పలేకపోయారు. బాబా "నేను మీకు అనేక అవకాశాలు ఇస్తున్నాను. నేను చేయు క్రియలు, చెప్పెడి మాటలు మీరు శ్రద్ధగా పరికించి మానవజాతికి మేలు చేయగలరని నేను ఆశిస్తున్నాను. మీరందరూ హృదయము కలవారని, మేలు చేయగలవారని నాకు తెలుసును" అని బాబా అన్నారు. తదుపరి ఒక గంట అనేకమైన ప్రశ్నలు నిశితమైనవి. ఆతురతను రేకెత్తించెడివి సభ్యులు అడిగారు. అందులో కొన్ని ఈ క్రింద పొందు పరచబడినవి.

*ప్రశ్న :* మీరు వస్తువులను ఎలా సృష్టించగల్గుతున్నారు? (How do you materialise objects)

***బాబా :*** నేను వస్తువులను నా సంకల్పశక్తి వలన సృష్టించగల్గుచున్నాను. మీరు మీ మానసికశక్తుల్ని పెంపొందించుకొని, మీ హృదయాలను పవిత్రము చేసికొన్నచో మీరు కూడ ఇట్లు చేయగలరు. అయితే నేను ఈ విశాల జగతిని ప్రేమించినట్లు మీరు కూడ ప్రేమించవలసియుండును.

*ప్రశ్న :* దీనికి విజ్ఞానశాస్త్రపు (Scientific Ex-

planation) ఆధారాలు ఏవి?

*బాబా :* భౌతికశాస్త్రము ఏదియు దీనికి అర్థము తెలియజెప్పలేదు. (Material Sciences). ప్రాపంచిక శాస్త్రముల పరిధి నియమితము. సైన్సు పరిశోధనలను గావించును. ఆధ్యాత్మికత అనుభవమును కలుగజేయును. అంతర్‌దృష్టిని ఒసగును. ఎంతో శక్తిగల మైక్రోస్కోపు కూడ చూడజాలనిది నేను చూడగలను. ఎంతటి గొప్ప వైద్యులకైననూ ఎక్స్‌రే కావలసి యుండును. రక్త పరీక్షల రిపోర్టులు, మలమూత్ర పరీక్షల రిపోర్టులు కావలసి ఉన్నవి. కాని నాకు అవేవీ అవసరంలేదు. నేను రోగనిర్ధారణ సరియైనది సరాసరి తృటిలో ఇవ్వగలను. (I can give correct diagnosis straight away)

## బాబా మహిమలు :

**ప్రశ్న : హోవర్డు మర్పెట్ తన గ్రంథంలో మీరు బావిలో పడిపోయినవానిని రక్షించినారని వ్రాసినారు. ఇదెట్లు సంభవమైనది?**

*బాబా :* భగవంతుడు ఒకేఒక్కడు. అతడు సర్వశక్తి సంపన్నుడు. ఆ సాయి మీ అందరిలోనున్నాడు. అతడెచట చూచిన అచటనేగలడు. నేను బావిలో మునిగి వానిని రక్షించిన తరి నేనిట నుండి కదలలేదు. సర్వభూతము లందున్న నేను రక్షించుటకు అచ్చట ఉన్నాను.

ఒకసారి న్యూమెక్సికో వాసురాలు "ఇందిరాదేవి (భర్త ఒక అమెరికన్) మీరిప్పుడు కూర్చున్న స్థలములోనే కూర్చున్నాడు. ఆయన ఇచట కూర్చుండి నాతో మాటలాడుచున్న సమయాన, ఆయన భార్య ఇందిరాదేవి అమెరికాలో కారు నడుపుచూ ప్రమాదమునకు గురియైనది. వెంటనే నేనామెను కాపాడవలసిన రక్షణ ఒసగియున్నాను. నాఎదుటగల ఆమె భర్తకు ఈ విషయమంతయు నేను చెప్పి ఆందోళన చెందవలసిన అవసరము లేదనియు తెల్పియున్నాను. తదుపరి ఈ సంఘటన నిర్ధారణ విషయము ఆమె ద్వారా తెలిసినది.

**ప్రశ్న : మీరు కృపను ఏ కొద్దిమంది మాత్రముపైన ఏలచూపుచున్నారు? అమెరికాలోని కోవన్ (Cowan) అను వ్యక్తిని, మన దేశమందలి రాధాకృష్ణ అను వ్యక్తిని వారు మరణించిన పిదప ఏల సజీవులను చేసినారు?**

*బాబా :* కొందరు వ్యక్తులను రక్షించవలయుననుటలో నేను కొన్ని ప్రత్యేకాంశములను పరిగణనలోనికి తీసికొందును. నా కృపకు పాత్రులగువారు, నాకు పూర్తి శరణాగతు లైనవారులు. ఆ పరిస్థితి కూడ ఆతనికెంతయు మహత్తర స్థితిని తెచ్చిపెట్టునదియై ఉండగలదు. మృత్యులు సజీవులైనారు. మృత్యుడైన కోవన్‌ను బ్రతికించినాను. ఆయన భార్య శవమైన తన భర్త కోవన్‌ను అమెరికా తీసికొని వెళ్ళవలసి ఉండెడిది. ముఖ్యమగు అమెరికా ప్రజలకు ఈ సంఘటన ద్వారా ఆధ్యాత్మిక మహిమలు' నా సందేశము అచట వ్యాపింప జేయ తలచితిని.

రాధాకృష్ణ విషయములో అతని జీవితము మరియొక పది దినములు అతని జీవిత విషయాలు, ఆస్తి వివరాల సర్దుబాటు చేసేందుకు వీలునామా మొదలైనవి వ్రాసేందుకు పొడిగించాల్సివచ్చింది.

**ప్రశ్న : మీకు పూర్వజన్మ విషయాలు ఎలా తెలుస్తాయి?**

*బాబా :* భూతకాలమేకాదు. భవిష్యత్తు కూడా నాకు గోచరమే. నేను కాలానికి, స్థలాలకు అతీతుణ్ణి. నామీద ఏవిధి నిషేధాలు అడ్డముగా రాజాలవు.

**ప్రశ్న : తమరు ఒక దేశానికి మొత్తం అంతటికీ కృపను ప్రసరింపగలరా?**

*బాబా :* ఆ. చేయగలను. నేను ప్రత్యేకమైన కృపను ఏదో ఒక దేశానికి మొత్తము అనుగ్రహింపగలను. అది నేను అవసరమని భావిస్తే, నేను మీకు పెక్కుసార్లు మీరు నన్ను అత్యంత సామీప్యముగ నన్నుచూడగలరని ఇంటర్వ్యూలను అనుగ్రహించియున్నాను.

## ఒకేమారు రెండు దేహాలలో :

**ప్రశ్న : జాన్ హిస్లాప్‌గారు మీ శిరస్సు చుట్టును ఏదో తేజోవలయం ఉన్నటుల దానినుండి తేజోపుంజములు వెడలగ్రక్కుచున్నటుల ఎట్లు గ్రహించగలిగారు?**

*బాబా :* వేలకొలది మంది దానిని చూడగలిగారు. మనోవికాసం పొందినవారు, నాపై పూర్తి ప్రేమకలిగినవారు దానిని చూడగలరు.

**ప్రశ్న : కొందరు తెల్పినటుల తాము ఒకేమారు రెండు దేహములలో ఎట్లు కన్పించగలరు?**

**బాబా :** నాకు పరిధులులేవు. నేను ఒకేమారు వేల రూపములలో కన్పించగలను. ఒకమారు చైనా యుద్ధము జరుగుచున్న సమయమున ఒక భక్తుడు అపాయమున చిక్కుకుని నన్ను ప్రార్థించినాడు. నేను ఈ శరీరమును ఇచట వదలి ఇంటికప్పు ద్వారా అతని చెంతకు చేరినాను. ఇంతలో నా పార్థివ శరీరము ఇచ్చట చచ్చినట్లు పడి యున్నది.

అనేక మందికి, బెంగుళూరు తదితర ప్రాంతాలకు నేను మరణించితిని అనిన వార్త అనేకానేక తంతి సమాచారములు వెళ్ళినవి. చివరకు గంధపు చెక్కలు నా భౌతికకాయమును దహనము చేయుటకు కూడా సిద్ధపరచబడినవి. ఆ సమయమున నేను మరల వచ్చి ఆపదల చిక్కిన నా శరీరమున చేరినాను. నేను సజీవుడనని, ఒకానొక భక్తుని రక్షించుట కిటుల చేయవలసి వచ్చినదని నేను నా చుట్టును గలవారికి తెలియజెప్పితిని.

**ప్రశ్న : తాము రాత్రి పూట ఎన్ని గంటలు నిద్రపోతారు?**

**బాబా :** నేను అసలు నిద్రించనే నిద్రించను. ఎల్లవేళల ఆలోచనా నిమగ్నుడనయ్యెదను. నేను పడకగది లైటు ఇతరుల నిద్రకు ఆర్పివేయుదును. స్నానాల గదిలోనికి పోయి అచ్చట భక్తుల నుండి వచ్చిన లేఖలు చదివి, వ్రాయుచుందును.

## దైవత్వమునకు ప్రబల సాక్ష్యము :

**ప్రశ్న :** మరల మాకు ఇంటర్వ్యూ అవకాశము ఎప్పుడు అనుగ్రహింతురు?

**బాబా :** నేను మొదటి అవకాశము బీదవారు, అత్యంతా వశ్యకముగల వారికి ఇంటర్వ్యూ అనుగ్రహింతును. ఈ దినము అనేక మంది పల్లెవాసులు సుదూర ప్రాంతముల నుండి భోజనము కూడ చేయక వచ్చియున్నారు. వారికి మొదటి అవకాశము ఇచ్చియున్నాను. కారణమేమన్న మరిన్ని రోజులు ఇచట ఉండుటకు వారివద్ద పైకముకూడ లేదు. నేను పనులన్నియు ముగించుకొనిన పిదప ఖాళీగా ఉన్నప్పుడు మిమ్ములను పిలువగలను.

ఈ బృంద సమావేశము ముగియు సందర్భమున ఈ పరిశీలక బృందములోని ఒక సభ్యుని చేతి ఉంగరములోని మణిపూస 1/4 × 1/2, లోగడ బాబా స్వయముగ సృష్టించి ఒసగినది మాయమైపోయినది. కొందరు దీనికై వెదకుట మొదలిడినారు. ఈలోగా చేరువనున్న గదిలోనికి బాబా ఒకరిపిదప ఒకరిని పిలిచి ఇంటర్వ్యూ ఇచ్చినారు. మాయమైన ఉంగరపు మణి దొరకలేదని బాబావైపు మేమెల్లరమూ చూచినాము. బాబా ఒక్కనవ్వు నవ్వినారు. మాటాడలేదు. సృష్టింపగల్గిన వ్యక్తి మాయముకూడ చేయగల శక్తిసంపన్నుడని మాకెల్లరకు అర్థము గావచ్చినది.

ఇంటర్వ్యూ అయిన పిదప ఆ ఉంగరములోని మణిని పోగొట్టుకొనిన వ్యక్తి భూతద్దము కావలెనని కోరినాడు. దాని సహాయమున ఉంగరము చూచినాడు. ఉంగరములోని మణి అంచులు ఎక్కడా నలగక ఎటులున్నది అటులే ఉన్నవి. ఈ తనిఖీ పూర్తి అయిన పిదప ఆ పరిశీలకుడు నాతో ఒకమాట మెల్లిగా చెప్పినాడు. ఈమాయమైన మణిస్థానమున మరల మణిని బాబా తీసికొని రాగలిగినచో బాబాను దైవమనే భావించగలనని తెల్పినాడు.

మరల ఇంటర్వ్యూ వచ్చినప్పుడు బాబా నోటితో గాలిని ముమ్మారు ఆ ఉంగరము మీద గట్టిగ వదలగనే అదృశ్యమైన మణి సరిగ ఆ ఉంగరములోనున్నది. పరిశీలక బృందములోని వారందరు ఆశ్చర్యమున ఎలుగెత్తి అరచినారు. బాబా అవతారపురుషుడనుటకు వేరే విధమైన సాక్ష్యము అవసరమేలేకపోయినది.

**(బ్లిట్జ్ పత్రిక, 14 ఆగస్టు 1976)**

*రాబోవు సంచికలో ఈ (గ్రంథముపూర్తి యగును)*

**"ఘనాఘనఘర్షణంబున గల్గు వైద్యుదాగ్ని
దధివి మధియింప లభియించును వెన్నముద్ద
మనస్సు మధనతో నార్తి ననుభవించెవగాదె
సాయిపాదారవింద సద్భక్తి సంభవించు"**

**- యార్లగడ్డ రాధాకృష్ణమూర్తి**

# దేవి ఇచ్చిన వెలుగు

సహాయ నిరాకరణోద్యమ కాలం. గాంధీజీ దక్షిణభారత పర్యటనలో భాగంగా, దక్షిణ కన్నడ జిల్లాలోని సిద్దాపురం వచ్చారు. గ్రామ ప్రజల ఆనందానికి అవధులు లేవు. పొరుగు గ్రామాల నుండి తండోపతండాలుగా ప్రజానీకం చేరింది.

మహాత్ముని దర్శనంతో పులకాంకితులైన ప్రజలు, గాంధీజీ ప్రసంగం వినాలని ఉవ్విళ్ళూరుతున్నారు. సిద్దాపుర గ్రామపెద్దలు, దేవికోం శివప్ప అనే ఒక బీద మహిళను ఊరేగింపుతో సభాస్థలి వద్దకు తీసుకొని వచ్చారు. మహాత్ముని ఎదుట నిల్చున్న దేవి ఆయనకు నమస్కారం చేసింది. మహాత్ముడు చిరునవ్వుతో ఆమెను పలకరించారు. ఆమె వెంట ఉన్న శంకరరావ్ గుల్వాడి ఆమెను గాంధీజీకి పరిచయం చేశారు. దేవిని గురించి విన్న గాంధీజీ ముగ్ధులయ్యారు.

సహాయ నిరాకరణోద్యమంలో భాగంగా ప్రభుత్వానికి పన్ను చెల్లించని వారిని అరెస్ట్ చేయసాగారు. ఉద్యమకారులైన నాగేశహెగ్డే, అతని అన్నదమ్ములు సమాలోచన చేసి, ఇంట్లో ఉన్న నగలు, వెండి వస్తువులు, నగదు పైకం అంతా ఒక తప్పేలాలో భద్రపరచి, దాన్ని కాపాడే బాధ్యత చిన్న తమ్ముడికి అప్పగించారు. తక్కిన వారందరూ జైలుకు వెళ్ళినా, తమ్ముడు మాత్రం, ఇంటి వద్దనే ఉండి, తనకు అప్పగించిన ధనాన్ని కాపాడటం అతని బాధ్యతగా చేసి, తక్కిన సోదరులు జైలుకు వెళ్లారు.

తనకు అప్పగించిన ధనరాశి గల తప్పేలాను తమ పోకతోటలో ఒకచోట భద్రపరచి స్వయంసేవకుడుగ, ఉద్యమంలో పనిచేసేవాడు. పోలీసులు అతన్నీ బంధించారు. తక్కిన వారికి ఏడాది, రెండేళ్ళ శిక్ష చెప్పారు. ఇతనికి ఆరు నెలల శిక్ష చెప్పారు. శిక్షపూర్తయిన తర్వాత, చిన్న హెగ్డే తోటలోనికి వెళ్ళి తాను భద్రపరచిన చోటికి వెళ్ళి తవ్వాడు. తప్పేలా కానరాకపోవటంతో భయంతో వణికాడు. అన్నగార్లు, వదినలు, జైలుశిక్ష ముగించుకొని వచ్చి నీవు భద్రపరచిన నగలు, పైకం ఎక్కడ? అని ప్రశ్నిస్తే 'ఏం సమాధానం చెప్పాలి?' దాచిన చోటనే మాయమైందని చెబితే వారు నమ్ముతారా? అందరినీ మోసగించి, తానే అపహరించి, ఇలా అబద్ధం చెబుతున్నాడని భావించరా? కుటుంబానికి చెందిన భూములు, ఇల్లు, తోటలు అన్నీ ప్రభుత్వం అది వరకే స్వాధీనం చేసుకుంది. పెద్ద అవిభక్త కుటుంబానికి జీవనాధారంగా ఉండగలదని, దాచి ఉంచిన పైకం మాయమైందంటే ఎవరు మాత్రం విశ్వసిస్తారు? అన్న

## జానమద్ది హనుమచ్ఛాస్త్రి

ఆలోచనా తరంగాలలో అతనికి మతి తప్పినట్లైంది. "ఇక్కడే దాచాను తప్పేలా మాయమైంది." అన్నగారికేం చెప్పాలి? అంటూ పలుచోట్ల తవ్వాడు. ఎంతో ఆరాట పడుతున్నాడు. కాని ఏం లాభం?

ఈ సంగతి ఎలాగో పోలీసుల చెవిని పడింది. వెంటనే పోకతోటకు కాపలా ప్రారంభమైంది. తోటంతా తవ్వారు. కాని దాచిన తప్పేలా కానరాలేదు. తోట సమీపంలోనే కాపురముండే శివప్పపై అనుమానంతో అతనిని అరెస్టు చేసి చితకబాదారు. ఆ సంగతి తనకే మాత్రం తెలియదు అని రోదిస్తూ చెప్పినప్పుడల్లా మరింతగా కొట్టారు. చిత్రహింసకు గురిచేసినా, తనకేమీ తెలియదనే చెప్పాడు. లాభం లేదనుకుని అతని భార్య దేవిని పిలిపించారు. లాఠీతో బాదారు. ఎంత కొట్టినా ఒక్కటే జవాబు 'నాకేమీ తెలియదు'. పోలీసులు విసుగెత్తి చుట్టుప్రక్కల వారిని హింసించారు. ఇంత జరిగినా తప్పేలా ఆచూకి తెలియరాలేదు.

శిక్షా కాలం పూర్తి అయిన తర్వాత తమ్ముని భార్య ఇంటికి వచ్చింది. పిచ్చి పట్టిన తమ్ముడు తన భార్యనే గుర్తించలేదు. ఆత్మహత్యకు పాల్పడుతాడేమో

## శరణాలయాల్లో.....

సంఘంలో ఒకప్పుడు
ఒక వెల్లు వెల్లినవాళ్ళు
ఇప్పుడు తుది సంధ్యలో
తిరుగాడుతున్నారు.
ఒకప్పుడు సమాజంలో
అంతర్భాగంగా శ్రమించిన వాళ్ళు
నేడు సంఘానికి భారంగా
కుమిలి కృశిస్తున్న వాళ్ళు
పల్కరించే వారు లేక
వెక్కిరింపులకు తాళలేక
ఆసరాకోసం నిరీక్షిస్తున్నారు
'ఆత్మ' కోసం జీవిస్తున్నారు.
తృప్తి లేని జీవితం ఎందుకని
తుది శ్వాస కోసం ఎదురుచూస్తున్నారు
తాము పెంచిన మొక్కలు
నీడ నివ్వడం లేదని ఆవేదనతో
అస్తిత్వం కోసం వృద్ధుల శరణాలయాల్లో
సేవలందుకుంటున్నారు!

**- యస్.యస్.రెడ్డి**

అన్న అనుమానంతో గ్రామపెద్ద, సర్దార్ వెంకటరామయ్య్య అతనిపై ఇద్దరిని నిఘా ఉండేట్లు ఏర్పాటు చేశాడు. అన్నగార్లు ఒక్కొక్కరే కారాగార విముక్తులై గ్రామానికి వచ్చారు. కొందరు ఇదంతా నాటకం అని కూడా గుస గుసలాడారు. చివరిగా, కుటుంబ పెద్ద నాగేశ హెగ్డే జైలు నుండి విడుదలై వచ్చారు. గ్రామస్థులు వారిని ఘనంగా ఊరేగించారు. పెద్ద సభ జరిగింది. హెగ్డే కుటుంబం వారి త్యాగనిరతిని కొనియాడారు. రాత్రి గం॥10-00 లకు సభ ముగిసింది. కుటుంబ యజమాని రాకతో, అందరికీ ఎంతో ఆనందం. జైలు అనుభవాలు, పోలీసుల జులుం, ఇంటి సంపద దాచిన తప్పేలా మాయం కావటం మున్నగు విషయాలు మాట్లాడుతూ ఇలా రాత్రి రెండు గంటలైంది. మాటలింకా పూర్తి కాలేదు. ఎవరో తలుపు తట్టిన సద్దు. మరలా పోలీసులు వచ్చారేమో అనుకొన్నారు. తలుపు తెరిచారు. ద్వారం ముందు నిల్చున్నది దేవి! లోపలికి వచ్చి తప్పేలాను నాగేశహెగ్డేగారి ముందు ఉంచింది. తండ్రీ!, ఇంతకాలం దీనిని కాపాడటానికెంతో కష్టపడ్డాను. ఈ దినం మీరు వచ్చారు. ఈ తప్పేలాను మీకు అప్పగించి నిశ్చింతతో నిద్రపోతాను. అని విన్నవించింది.

నాగేశ హెగ్డే గారికి, తప్పేలాను చూచిన ఆనందం కంటే, ఇంతకాలం, దానిని భద్రపరచిన దేవి ధైర్యానికి, త్యాగనిరతికి నివ్వెరపోయారు. ఆమె ఉపకారం అవిస్మరణీయం అనుకున్నారు.

"నిమిత్తమాత్రంగా ఆ తప్పేలా నాది. కాని ఇంతకాలం నీవు భద్రపరచక ఉంటే అది ఎవరి పాలో అయ్యేది. ఇప్పుడు ఈ సంపద నీది. ఇందులో నీకు ఇష్టమున్నంత తీసుకోవాలి." అన్నారు నాగేశహెగ్డే.

"మీరు అలా అనకండి. ఈ సంపద మీది. మీకు అప్పగించేదాకా భద్రపరచడం నా కర్తవ్యంగా భావించాను. మీరు దయచేసి తప్పేలాలో ఉంచిన వస్తువులు అన్నీ ఉన్నాయో లేదో చూచి చెప్పండి. అంటూ తప్పేలాలోని నగలు, నాణేలు అన్నిటిని కుమ్మరించింది, దేవి.

బంగారు, వెండి నగలు, నాణ్యాలు రాశులుగ పడటం చూసిన హెగ్డే కుటుంబీకులందరు ఆనంద భాష్పధారలతో తన్మయులయ్యారు.

నాగేశ హెగ్డేగారు బంగారు గొలుసును తీసుకుని "తల్లీ! ఇది నీకు నా కానుక" అంటూ దండను ఆమె మెడలో వేశారు.

దేవి వెంటనే దానిని తీసి,హెగ్డేగారి మనుమరాలి మెడలో వేసి 'అయ్యా, ఈ గొలుసు నాది కాదు. ఇది మీకు చెందాల్సిందే' అన్నది.

తాము భద్రపరచిన నగదు నాణ్యాలన్నీ అలాగే ఉండటం హెగ్డే కుటుంబం, గమనించింది. మేము భద్రపరచిన వస్తువులన్నీ ఉన్నాయి. కాని, ఈ నిక్షేపం నీకెలా లభించిందో చెప్పమన్నారు.

దేవి "మీరందరూ జైలుకు వెళ్ళారు. ఒకరోజు

వేకువనే నేను తోటలో కట్టెలు ఏరేందుకు వెళ్ళాను. ముందు రోజు రాత్రి భారీవానలొచ్చాయి. కాలువలు పొంగి పొర్లాయి. ఒక కాలువ చివర ఏదో తళుక్కుమని మెరిసి నట్లయింది. చూశాను. తప్పేలా అంచు కనిపించింది. ఆకులు, తీగలతో దానిని మూసి, రాత్రి వెళ్ళి ఆ తప్పేలా తీసుకుని వచ్చి ఇంట్లో దాచాను. నా భర్తకు ఆ సంగతి చెప్పాలనుకున్నాను. అతని సహాయంతో దానిని రహస్యంగా భద్రపరచాలనుకున్నాను. సిద్ధాపురం సంతకు వెళ్ళిన, నా భర్త ఆ రాత్రి తిరిగి రాలేదు. రాత్రి అయినట్లల్లా నా ఆలోచనలు పలు రీతులుగా సాగాయి. ఇది, స్వామి ధనం. దీనిని నాభర్త, నా కన్నుకప్పి అపహరిస్తే స్వామి ద్రోహం చేసినట్లవుతుంది. తాగుబోతైన నా భర్త, దీనిని కాజేస్తాడేమో? ఏం నమ్మకం? ఈ విషయం ఎవరికీ తెలుపరాదు. నేనొక్కదాన్నే దీనిని భద్రపరచాలి, అని నిశ్చయించుకొన్నాను. వంట పొయ్యిముందు కూర్చునే చోట గుంత తవ్వి, ఈ తప్పేలా దాంట్లో ఉంచాను. మట్టితో కప్పి కూచోడానికి చిన్న బండ వేశాను.

"కొన్ని రోజుల తర్వాత చిన్నయ్యగారు జైలు నుండి విడుదలై వచ్చారు. తప్పేలా దాచిన చోట తవ్వారు. కానరాకపోయేసరికి అందరికీ ఆ సంగతి చెప్పారు. పోలీసులు నా భర్తను అరెస్టు చేసి జైల్లో కుక్కారు. చితక బాదారు. ఆ చిత్రహింసను చూచి, వాస్తవం వెల్లడించాలి అనిపించింది. కాని యజమానికి ద్రోహం చేయరాదని, వాస్తవాన్ని చెప్పలేదు. పోలీసులు నన్ను పలువిధాల హింసించారు. కాని వారికి వాస్తవం చెప్పలేదు. పోలీసుల దెబ్బలకు నా భర్త ఒళ్ళు హూనమైంది. విపరీతంగా జ్వరం, పైగా మశూచి దాపరించింది. చూస్తున్నట్లే మూడు రోజుల్లోనే కన్నుమూశాడు. నా కొడుకు అనాథ అయ్యాడు. భర్త మరణించిన తరువాత నాబిడ్డ ముఖం చూస్తూ బ్రతికాను. మీ సొమ్ము మీకు అప్పగించి, ఆ బాధ్యత నుండి విముక్తురాలు కావాలన్న చింత నన్ను దహిస్తూనే ఉండింది."

దేవి చెప్పినదంతా అందరూ విన్నారు. నాగేశ హెగ్డే "తల్లీ! నీవు సామాన్యురాలు కాదు. పుణ్యాత్మురాలివి. నీ కుమారుడు అనాథబాలుడు కాదు. వాడు నాకు మరో తమ్ముడు. నీకోసం కాకపోయినా, వాడికోసం, ఈ బంగారు వస్తువుల్లో నీకు కావలసిన దానిని తీసుకోక తప్పదు. అంటూ బంగారు గొలుసులు రెండింటిని ఆమె ఒడిలో వేశారు.

దేవి, తటాలున నిల్చున్నది. "మీ సంపదను నా ఇంట ఉంచుకున్నంత కాలం, ఒక్క రోజు కూడా కంటి నిండ నిద్రపోలేదు. నా భర్త చావుకు కారణం ఈ ధనరాశే. ఇప్పుడు, ఈ సంపదను తీసుకుంటే నా కుమారుడు కూడా నాకు దక్కడు. ఇది నాకు అక్కరలేదు. మన్నించండి స్వామీ" అంటూ నమస్కరిస్తూ దేవి వెళ్లిపోయింది. అంటూ ఆమె కథ నివేదించారు గుల్వాడి గారు.

ఈనాడు గ్రామ ప్రజలు ఆమెను ఎంతగానో గౌరవిస్తున్నారు. ఆమెకు హారతులిస్తూ, ఊరేగింపుగా ఇక్కడికి పిలుచుకుని వచ్చారు. ఆమె స్వామి భక్తికి, నిజాయితీకి పట్టం కట్టారు. అంటూ శంకరరావ్ గుల్వాడి, మహాత్మునికి, దేవి చరిత్ర చెప్పారు. ఆమె జీవిత గాథ విన్న గాంధీజీ కన్నీళ్ళు ఒత్తుకున్నారు. గుండె నిండా ఆమే అయ్యింది.

"దేవి వంటి పుణ్యాత్ములు ఉండబట్టే ఈ జగత్తు ఇలా నడుస్తూ ఉంది" అన్నారు గాంధీజీ ఉద్వేగంతో.

*("ఉదయవాణి" - స్వాతంత్ర్య స్వర్ణోదయ ఆగస్ట్ - 97 సంచికలోని, జీ.యు.భట్. గారి రచన ఆధారంగా)*

## విదురనీతి

"కృతజ్ఞం ధార్మికం సత్యం
అక్షుద్రం దృఢభక్తికమ్
జితేంద్రియం స్థితం స్థిత్యాం
మిత్రమత్యాగి చేష్యతే"

కృతజ్ఞుడు, ధార్మికుడు, సత్యవంతుడు, నీచుడు కానివాడు (ఉదారుడు), దృఢమైన అనురాగము గలవాడు, జితేంద్రియుడు, మర్యాదను ఉల్లంఘింపనివాడు, స్నేహమును వీడనివాడున్ను, మిత్రుడుగా అంగీకరింపదగినవాడు.

# దర్శనములు, పతంజలి యోగము

## డా॥ కాజ లక్ష్మీ నరసింహారావు

ఆత్మజ్ఞాన ప్రాప్తికి భగవద్భక్తి ప్రధాన సాధనము. ఆస్తిక నాస్తిక దర్శనముల సారము తెలిసికొన్నచో ప్రస్థానత్రయము సుబోధకము కాగలదు. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత యీ మూడింటికి ప్రస్థాన త్రయమని వ్యవహారము.

లోకమున మహాశాస్త్రములున్నవి. వాని యందు వ్యాకరణ మొక్కటి. వ్యాకరణము వేదాంగము. వ్యాకరణము కూడా ఒక దర్శనమే. ఇది దర్శనమేనని యెందఱకు తెలియును. వాక్యపదీయకారుఁడైన భర్తృహరి వ్యాకరణ శాస్త్రమును ధర్మమని అన్నాడు. వ్యాకరణము దర్శనమని తెలియుట ఒక ఎత్తు. కాగా ఆ శాస్త్రమునకు దర్శనత్వ సిద్ధియెట్లు కలిగినదో తెలియుట ఒక యెత్తు.

అనాదిగా శాస్త్ర నిర్మాణ పద్ధతి వేఱుగా ఉన్నది. ఋషులకుఁ బారమార్థిక దృష్టి ఉన్నది. శాస్త్ర నిర్మాణ విధానమున, ఏ ఋషి యే దృష్టి కలిగి ఉన్నాడో, ఆ దృష్టి తోడనే, ఆ శాస్త్రమును మనము అధ్యయనము చేయ వలయును.

దర్శనములున్నవి. అవి ఆరు. వానిలో మూడు నిరీశ్వర వాద సమర్థతములు. అవి (1.) వైశేషికము, (2) సాంఖ్యము, (3) పూర్వ మీమాంస. ఆయా శాస్త్ర నిర్మాతలు కణాద, కపిల, జైమిని మునులు. ఆశ్చర్య మేమనఁగా వీరందరు మహర్షులు, బ్రహ్మజ్ఞానులు. వేద ప్రామాణ్యము నంగీకరించినవారు.

ఋషుల శాస్త్ర నిర్మాణ దృష్టికి, వారి పారమార్థిక దృష్టికి భేదము లేదు. సాధన రూపమున యోగ శాస్త్రమును, పారమార్థిక దృష్టితో పరమార్థసార, మహా భాష్యములను భగవాన్ పతంజలి నిర్మించుటలో విశేషమున్నది. వ్యాస భగవానులు సాధన రూపమున శాస్త్రమును జూడలేదు. కేవల పారమార్థిక దృష్టితో ఉత్తర మీమాంసా దర్శనమును నిర్మించిరి.

ప్రతి ప్రాణియు సుఖమును అపేక్షించును. దుఃఖమును ద్వేషించును. ఎంత ప్రయత్నించినను జీవుఁడు దుఃఖమునే పొందుచున్నాడు, అనుభవించు చున్నాడు. కావున సుఖ ప్రాప్తికంటే దుఃఖ నివృత్తియే ముఖ్యము. ఈ దుఃఖము రాకుండుట యెట్లు? మొదటనే యత్నతః రాకుండా చూచుకొనుట యొకటి. దుఃఖము ప్రాప్తించినచో, ఆ దుఃఖమును నివారించుకొనుట రెండవది. దుఃఖము వచ్చును. దానిని అనుభవించిన గాని దానికి నివృత్తి కలుగదు. ఈ సంసారమే సర్వ దుఃఖములకు గారణము. దేనిని సుఖ సాధనముగా జీవుఁడు భావించుచున్నాడో క్రమశః అదియే దుఃఖ కారణ మగుచున్నది. భార్యాపుత్రులు సుఖ సాధనములే గాని, వారికి ఏదేని కష్టమో నష్టమో సంభవించినప్పుడు, ఆ కుటుంబ భర్తకు, అది దుఃఖహేతువే కదా! ఈ ప్రపంచ మంతయు దుఃఖమయము. ఈ ప్రపంచము సంసార బంధ కారణమగుచున్నది. ఈ సంసార బంధహేతువు యొక్క విచ్ఛిత్తియే మోక్షమని భావింపవచ్చును.

భారతీయులు ధర్మార్థ కామ మోక్షములను నాలుగు పురుషార్థములను విశ్వసించుదురు. అర్థ కామముల కంటె, ధర్మము కంటె మోక్షము ఉత్తమోత్తమ మైనది. ధర్మము అభ్యుదయ నిశ్రేయస సాధనము. మహర్షి కణాదుఁడిట్లని చెప్పెను. జీవితానంతరము స్వర్గాది సుఖములు, జన్మాంతరములలో సౌఖ్యము పొందుటయే అభ్యుదయము. ఐహిక సుఖానుభూతి కంటె స్వర్గ సుఖాను భూతి గొప్పది. అర్థకామముల కంటె ధర్మాచరణ వలన కలుగు సుఖము ఇంకను గొప్పది. కాని యీ ధర్మాచరణ వలన కలుగు సుఖమున గూడ కొంత దుఃఖము మిళితమై యున్నది. అందువలన ధర్మము, మోక్షమంతటి యుత్తమోత్తమ పురుషార్థము కాదు. ధర్మాచరణము వలన

స్వర్గ ప్రాప్తి కలుగుచున్నది. స్వర్గమునకు నాకమని పేరు. అనగా దుఃఖము లేనిదని యర్థము. కాని దేవతలకు కూడా రాక్షసుల దండయాత్రల వలన దుఃఖము కలుగుచున్నది కదా!

"జ్ఞానా దేవహి కైవల్యమ్" జ్ఞానము వల్ల మోక్షప్రాప్తి. మోక్ష సాధనకు జ్ఞానము కంటె వేరు మార్గము లేదు. నిశ్రేయసమనగా మోక్షము వలన కలుగు సుఖము. ఆ సుఖము అనంతము, అఖండము, ఏకము, నిరతిశయము, నిరవధికము, రసాత్మకమును. అక్కడ దుఃఖలేశము కూడ ఉండదు. ధర్మమోక్షములు రెండును పురుషార్థములే గాని, ధర్మము మోక్షోపాయ సాధనము. అసలు ఫలము మోక్షమే. మోక్ష ప్రాప్తికి, సంసార మూలకారణము యొక్క నాశనము ప్రధాన విషయము. ఈ సంసారమునకు మూలకారణ మేమిటి? ఈ కారణమును అన్వేషించుటలో, ఆవిష్కరించుటలో దర్శన కర్తలు భిన్న మార్గములను ప్రదర్శించిరి. సంసార మూలకారణ నాశకమయిన జ్ఞానమును నిరూపించుట యీ దర్శనముల యొక్క ఆంతర్యము. ఇట్టి జ్ఞాన సాధనమును 'విద్య' అని గాని 'దర్శన' మని గాని చెప్పవచ్చును. దర్శన శబ్దము కరణ ప్రత్యయాంతము.

దర్శనములు, దర్శనకర్తలలో మరల రెండు విధములున్నవి. నాస్తికులైన దర్శన కర్తలున్నారు. సంసార మూలమును గ్రహించుటకు బుద్ధి బలము ఆవశ్యకమని వీరి మతము. వీరు నాస్తికులు వీరి దర్శనములు నాస్తిక దర్శనములు. మరి కొందరున్నారు. వీరిని ఆస్తికులని యందురు. వీరి దర్శనములు ఆస్తికములు. పురుషుని బుద్ధి ప్రమాద భూయిష్టమైనది. కాబట్టి బుద్ధి బలముపై ఆధారపడి చేసిన యూహాలలో సత్యము నిరూపింప బడక పోవచ్చును. వేదములెంత ప్రాచీనమైనవనగా అవి అనాది, వాని యుత్పత్తి మానవ మేధకు అందనంత ప్రాచీనమైనవి. మఱియు వేదములకు సృష్టికర్తయని యెవ్వరును లేరు. అవి అపౌరుషేయములు. స్వతః ప్రమాణములు. వేదము నిర్ణయించిన మార్గమున మన ఆలోచనలు సాగవలయును. ఆస్తికులందరు ఈ మార్గమునకు చెందినవారు. ఇట్టి వారి చేత ఆవిష్కరింపబడినవి ఆస్తిక దర్శనములని అందురు. తద్భిన్నముగ వేద ప్రామాణము నంగీకరింపని వారిని నాస్తికులుగా పరిగణింప వలయును. మనువు ఇట్లే చెప్పినాడు. "నాస్తికో వేద నిందకః" దేవుడు లేడన్నవాడు నాస్తికుడని, దేవుడున్నాడన్న వాడు ఆస్తికుడని పేర్కొనుట లోకములో నున్నది. కాని యిది సమంజసమైన నిర్వచనము కాదు. విచిత్ర విషయమేమనగా జైనులున్నారు. వీరు ఈశ్వరుని అంగీకరింతురు. కాని వీరు నాస్తికులే. కణాద, కపిల జైమినులున్నారు. వీరి దర్శనములు ఈశ్వరుని అంగీకరింపవు. కానీ వీరు ఆస్తికులే. ఇందుకు కారణము ఈ మహర్షులు వేద ప్రమాణమును అంగీకరించుటయే.

ఆస్తిక నాస్తిక దర్శనముల విషయమున భ్రాంతి నొందుటకు గొంత అవకాశమున్నది. మహర్షి పాణిని యొక్క "అస్తి నాస్తి దిష్టం మతిః" అను సూత్రమున గల "దిష్టమ్" పదమును ప్రత్యయ విశేషణముగా భావించుట యీ భ్రాంతికి గారణమయినది. దిష్టమనగా దైవము. "దైవం దిష్టం భాగధేయమ్" అని నిఘంటువు. అస్తి దిష్టమితి మతిః యస్యసః ఆస్తికః, నాస్తి దిష్టమితీ మతిః యస్యసః నాస్తికః - ఇట్లు వ్యాఖ్యానించుటలో ఈ భ్రాంతి కలుగుచున్నది. యదార్థముగా పాణినీయము నందలి దిష్టమ్ అను ప్రయోగము ప్రకృత్యంతరమే గాని ప్రత్యయ విశేషణము కాదు.

వేద ప్రామాణము నంగీకరించు ఆరు దర్శనములను మోక్షము తత్సాధనములను గూర్చి ప్రసంగించును.

## సుభాషితములు

"మాతృవత్ పర దారేషు
పరద్రవ్యేషు లోష్ఠవత్
ఆత్మవత్ సర్వ భూతేషు
యః పశ్యతి సః పణ్డితః

ఇతరుల భార్యలను తన తల్లివలెను, ఇతరుల డబ్బును మట్టిపెడ్డవలెను, ప్రాణులందరిని తన వలెను ఎవడు చూచుచున్నాడో వాడే సరియైన పండితుడు.

అవి 1. వైశేషికము (కాణాదము), 2. న్యాయము (గౌతమ), 3. సాంఖ్యము (కాపిల), 4. యోగము (పతంజలి), 5. పూర్వమీమాంస (జైమిని), 6. ఉత్తర మీమాంస (బాదరాయణ వ్యాసుడు). ఈ దర్శనములకు వేదము ప్రమాణము. ఇవిగాక నాస్తిక దర్శనములు ఆరు గలవు. అవి 1. చార్వాక, 2. బౌద్ధ, 3. జైన, 4. అర్హత, 5. దిగంబర, 6. సౌమ దర్శనములు. ఈ ఆరింటికి వేదము ప్రమాణము కాదు. బార్వాక బౌద్ధ దర్శనముల ననుసరించి దేహమే ఆత్మ. వీరికి పరజన్మలేదు, పరలోకములేదు. ప్రత్యక్షమే వీరి ప్రమాణము. స్వర్గ నరకము లెక్కడనో లేవు. మనము అనుభవించు సుఖమే స్వర్గము. మనము అనుభవించు కష్టమే నరకము. "యావజ్జీవం సుఖం జీవేత్, నాస్తిమృత్యో రగోచరః భస్మీ భూతస్య, దేహస్య పునరాగమనః కుతః". బౌద్ధ మతమున ప్రత్యక్షమని, అనుమానమని రెండు ప్రమాణములున్నవి. మరణమే మోక్షమని యీ మతమున భావింపబడును. నాస్తిక దర్శనములలో సౌమ దర్శనమొక్కటియే జంతు వధ, మద్య సేవనము, భైరవ పూజలను అంగీకరించును. మిగిలిన దర్శనములు అహింసను పరమ ధర్మముగా అంగీకరించుచున్నవి.

జీవుని కంటె వేఱుగా ఈశ్వరుడు లేడని కణాదుని దర్శన సారాంశము. జీవుని కంటె వేఱుగా ఈశ్వరుడున్నాడని న్యాయ దర్శనము స్థాపించుచున్నది. సాంఖ్య దర్శనమున ఈశ్వరుడు నిరాకృతుడు. యోగ దర్శనమున ఈశ్వరుడున్నాడు.

ఈశ్వరుడనగా నెవ్వరు? పతంజలి యిట్లు చెప్పుచున్నాడు. "క్లేశ కర్మ విపాకాశయైరపరామృష్టః" పురుష విశేషః ఈశ్వరః సాంఖ్యము, నిరీశ్వరము, యోగము సేశ్వరము. ఈ రెండు దర్శనము కిదియే ప్రధాన భేదము ఇట్లుండగా వైశేషిక, సాంఖ్య పూర్వమీమాంసలు నిరీశ్వర దర్శనములు. న్యాయ యోగ ఉత్తర మీమాంసలు సేశ్వర దర్శనములు. ఈశ్వరుడు నిమిత్త కారణమని న్యాయ యోగ దర్శనములు చెప్పుచుండగా ఈశ్వరుడు ఉపాదాన నిమిత్త కారణమని ఉత్తర మీమాంస వివరించినది.

కణాద, గౌతమ, కపిల, పతంజలి, జైమిని దర్శనములు ఆత్మ యొక్క బహుత్వమును ప్రతిపాదించగా, వ్యాసుని యుత్తర మీమాంస ఆత్మ యొక్క ఏకత్వమును, జగత్తు యొక్క మిథ్యాత్వమును నిరూపించినది. కాపిల దర్శనములోని ప్రమాణములను స్వీకరించినందున కొందఱు పతంజలి యోగ దర్శనమును ప్రత్యేక దర్శనముగా అంగీకరింపరు. కొందరు యోగమును సాంఖ్య ప్రభేదముగా నంగీకరించుచు, యోగ దర్శనమును సేశ్వర సాంఖ్యమని వ్యవహరించుదురు.

**పతంజలి యోగ దర్శనము :**

యోగ దర్శనము యొక్క నిర్మాత పతంజలి ముని. ఈ యోగ దర్శనమునకు భాష్యకారుడు వ్యాస మహర్షి. వార్తికకారుడు విజ్ఞాన భిక్షువు. బుద్ధి సత్వ పురుషులకు భేదాగ్రహము వలన బంధము కలుగుచున్నది. దాని భేద జ్ఞానము వలన కైవల్య ప్రాప్తి. పురుషుడు అసంగ చిద్రూపుడు. బుద్ధి, సత్యము త్రిగుణాత్మక మయినది. అయస్కాంతము వలె ఇది పురుషుని ఆకర్షించుచున్నది. బుద్ధి సంబంధము విడివడి మరల ఆ సంబంధము కలుగ కుండుటయే కైవల్యము. ఇదియే మోక్షము. సమాధి సిద్ధించుటకు అష్టాంగ యోగము ఒక మార్గము. ఈశ్వర ప్రణి ధానము వలన కూడ సమాధి సిద్ధించును. సత్వ పురుష జ్ఞానము సమాధి వలననే సాధ్యము. సంసార బంధమునకు అవిద్యయే కారణము. అవిద్య యనగా అజ్ఞానము. వివేక జ్ఞానము కలిగి జీవుడు కైవల్యమును బొందుచున్నాడు.

యోగ దర్శనమును నిర్మించిన భగవాన్ పతంజలి ఆదిశేషుని యొక్క అవతారమని భారతీయుల విశ్వాసము.

**శ్లో॥ ఆ బాహు పురుషాకారం, శంఖ చక్రాసిధారిణమ్**
**సహస్ర శిరసం శ్వేతం పతంజలి ముపాస్మహే॥**

గోనర్ద దేశమున గోణిక అను సూర్యో పాసకురాలు ఒకనాడు ప్రాతస్సమయమున అర్ఘ్యమిచ్చు చుండగా, ఆమె దోసిలి నుండి "వేయి పడగల" స్వామి యొకడావిర్భవించెను. ఆయనయే పతంజలి. ఆయన ఆమెకు యోగమును బోధించెను. అంజలేః పతితః పతంజలిః, పతత్ అంజలిః, పతంజలిః. పతంజలి ప్రసిద్ధ

గ్రంథములు నాలుగు ప్రచారమున ఉన్నవి. 1. యోగ సూత్రములు, 2. వ్యాకరణ మహాభాష్యము, 3. చరక సంహిత, 4. పరమార్ధ సారము. చరక సంహిత పతంజలి రచనయేననుట నిర్వివాదము. "మంజూష"లో నాగేశ పండితుడు "తదుక్తం చరకే పతంజలినా" అని ప్రస్తావించెను. చక్రపాణి దత్తుడు చరక సంహితకు వ్యాఖ్యాత. "పాతంజల మహాభాష్య చరక ప్రతి సంస్కృతైః మనోవాక్కాయ దోషాణాం హంత్రే2హి పతయే నమః" అని ప్రశంసించుచు, చరక సంహిత యొక్క స్రష్ట పతంజలి అని చెప్పినాడు. అతడు గూఢచారిగా సంచరించిన కారణమున పతంజలికి జరకుడని పేరు వచ్చినది. "అజ్ఞాతః చరః" చరకః అని. అజ్ఞాత్ అని సూత్రము. అజ్ఞాతార్ధమున చర శబ్దము కంటె స్వార్ధిక కప్రత్యయము చేరి చరక శబ్దము నిష్పన్నమైనది. "పరమార్ధసారము" కూడా పతంజలి రచనయేనని నాగేశుని మంజూషలో వివరింపబడినది.

పతంజలి యోగ దర్శనము మొత్తము 194 సూత్రములు నాలుగు పాదములుగా విభక్తమయినది. 1. సమాధి, 2. సాధన నిర్దేశము, 3. విభూతి, 4. కైవల్యము. కాపిల దర్శనము నందు వలె యోగమున కూడ ఇరువది యైదు తత్వములంగీకరింపబడినవి. పురుషుని కంటె అధికముగా, ఈశ్వరుని అంగీకరించుట యీ దర్శనమున గుర్తింపదగు విషయము. ఈశ్వరానుగ్రహము లేనిదే సమాధి సిద్ధింపదు. పురుషుని కంటె వేరుగా ఈశ్వరుని అంగీకరింపక తప్పదు. శుద్ధ కర్మాచరణము జ్ఞాన

"సర్వదా కృతకార్యోహం
ఏష్యామి సహ సీతయా
ఆనయిష్యామి వాలంకాం
సముత్పాట్య సరావణమ్"

"నేను అన్ని విధముల కృతకృత్యుడనై తిరిగి వత్తును. (ఒకవేళ సీత కనిపించకున్నచో) రావణునితో సహా లంకను పెకలించి తెత్తును."

**- హనుమంతుడు**

సాధనమని సాంఖ్యము చెప్పుచున్నది. బద్ధుడైన పురుషునికి యోగము మోక్ష సాధనమని యోగము చెప్పుచున్నది. సాంఖ్యము కంటె యోగము భిన్నమైన దర్శనమని నిరూపింపబడినది. సమాధి అనునర్ధమున యుజ్ ధాతువు నుండి యోగ శబ్దము పుట్టినది. "యుజసమాధౌ" యుజిర్ యోగే అను ధాతువు నుండి కూడ యోగ శబ్దము పుట్టినది. ఇక్కడ యోగ శబ్దమునకు సమాధియని యర్ధమే గాని, సంయోగమని యర్ధము కాదు. యోగ శబ్దమునకు అనేకార్ధములున్నవి. "యోగః చిత్త వృత్తి నిరోధః" అను నిర్వచనము కూడ యోగ శబ్దమును గూర్చి పతంజలియే చెప్పెను. చిత్తవృత్తి నిరోధము లేనిచో ఆత్మ విద్య సిద్ధింపదు. యోగము ఆత్మ విద్యా సాధనమని యుపనిషత్తులు పేర్కొన్నవి. ఆత్మ విద్యా ప్రాప్తికి యోగము ముఖ్య సాధనము గావుననే వ్యాసభగవానుడు భాష్యము వ్రాయుట, శ్రీ శంకరులు వ్యాఖ్య వ్రాయుట జరిగినది.

యోగాంగానుష్ఠానము వలన సమ్యక్ జ్ఞానము లభించుచున్నది. యోగాంగములు ఎనిమిది. 1. యమము, 2. నియమము, 3. ఆసనము, 4. ప్రాణాయామము, 5. ప్రత్యాహారము, 6. ధారణ, 7. ధ్యానము, 8. సమాధి.

**1. యమము :** అహింస, సత్యము, అస్తేయము (దొంగతనము చేయరాదు) బ్రహ్మచర్యము, అపరిగ్రహము (దానము పట్టరాదు). ఇందలి లక్షణములు.

**2. నియమము :** శౌచము, సంతోషము, తపస్సు స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము, ఇందలి లక్షణములు.

**3. ఆసనము :** నిశ్చలముగా, సుఖముగా కూర్చొని యుండుట దీని లక్షణము పద్మాసనము, వీరాసనము, భద్రాసనము మున్నగు భేదములీ ఆసనమున గలవు.

**4. ప్రాణాయామము :** ఉచ్ఛ్వాస నిశ్వాసముల గతిని నిరోధించుటయే ప్రాణాయామము.

**5. ప్రత్యాహారము :** ఇంద్రియ వశీకరణకిది అత్యంత ప్రధాన విషయము.

**6. ధారణ :** చిత్తమును నాభియందుగాని హృదయము నందు గాని, నాసికాగ్రమున గాని బంధించుటయే ధారణ.

చిత్తమును జ్ఞాన రూపమున బంధించుటయు ధారణయే.

7. ధారణ వలన ధ్యానము లభించి, దాని వలన ఏకాగ్రత దాని వలన జ్ఞానము లభించును.

8. **సమాధి :** ధ్యానము చేయుట వలన ధ్యేయవస్తువు యొక్క ఆకారమును చూపట్టి ప్రత్యయాత్మకమైన రూపముతో శూన్యమైనది వలె నుండును. దీనినే సమాధ్యవస్థ అని అందురు.

ధారణ ధ్యాన సమాధులు మూడింటిని కలిపి "సంయమము"ని యందురు. ఈ సంయమము పాటించి నందువలన చిత్రాతి చిత్రములైన సిద్ధులు సిద్ధించు చుండును. జ్ఞాన ఫలములు లభించును. బుద్ధి సత్వమునకు బురుషునకు గల భేదము తెలియును. యోగాభ్యాసము చేయు వారికి ఆకాశగమనము, భూతిజయము అగ్నిలో నుండి జ్వలించుచు సజీవముగా నుండుట వంటి సిద్ధులు లబించును. వీనికి యోగి యగువాడు ఆశ్చర్యపడరాదు, ప్రలోభపడరాదు.

తపము వలన యోగము సిద్ధించును. అనాది సిద్ధమగు క్లేశములు క్షీణించును. మనస్సెప్పుడును చంచలమయినది. ఏకాగ్రత లేనిది ఏదియును సాధింప జాలము. ఏకాగ్రత సాధనకు యోగము సముచితమైన మార్గము ఈశ్వరుని ఉపాసించుట చేత చిత్తవృత్తి నిరోధము కల్గి సమాధి స్థితి లభ్యమగును. చిత్తవృత్తులను నిరోధించుటయు యోగమే.

ఈశ్వరుడు ఓంకార శబ్దవాచుఁడు. "తస్య వాచకః ప్రణవః" అని పతంజలి వాక్కు. ఈశ్వరానుగ్రహము లేనిచో మోక్ష ప్రాప్తియే లేదు. ఈశ్వరుని అనుగ్రహమే సర్వసృష్టికిని మూలము ఈశ్వర ప్రణి ధానము వలననే సమాధి సిద్ధించును. ●

## పదాల పందిరి - 11 సమాధానాలు

అడ్డం : 1. మహిమ, 3. గీర్వాణి, 5. ఖరము, 7. విరి, 9. ఆశ, 10. పుట్ట, 11. గానం, 12. విడు, 14. దంచు, 16. సారంగం, 18. వంగర, 19. జవ్వని

నిలువు : 1. మనవి, 2. మఖ, 3. గీము, 4. ణిర్వాశ, 6. రద్దు, 8. రిపుడు, 9. ఆనందం, 12. విభవం, 13. బీరం, 15. చుక్కాని, 16. సార, 17. గంజ.

## పదాల పందిరి - 12

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ★ | 3 | | 4 |
| | ★ | 5 | 6 | | ★ | |
| 7 | 8 | ★ | | ★ | 9 | |
| ★ | 10 | | | 11 | | ★ |
| 12 | | ★ | 13 | ★ | 14 | 15 |
| | ★ | 16 | | 17 | ★ | |
| 18 | | | ★ | 19 | | |

**ఆధారాలు :**

**అడ్డం :** 1. ఆకుపచ్చ వర్ణం, 3. చందమామ, 5. గౌరవ నామధేయం, 7. ఋషి, 9. విసిగించుట, 10. లాభం రాకపోతే? 11. తెలుగు స్టోరీ, 12. చివర తగ్గినా అర్థం మారని ప్రజలు, 14. ఆభరణం, 16. సంకల్పించుకొనుట, నామవాచకం, 18. పేదరికం, 19. చెడు.

**నిలువు :** 1.చేయి, కరము, 2. తమిళ తమ్ముడు, 3. మాయ, మంత్రం, 4. కాలేయం, 6. సుగ్రీవ పత్ని, 8. మాత, క్రిందనుండి, 9. టీచింగ్, 12. ఇందులో నూనెపోసి వత్తి వేస్తేనే వెలుగు, 13. బియ్యపు పొట్టు, 15. కనిష్టం కాదు, పెద్దది, 16. సముద్రము చిన్నదిగా!, 17. చిన్నదైన అల్పం తిరగబడింది.

**-కిరీటి**

# ఐదునెలల్లో దేవీ భాగవత పురాణాన్ని ఆంధ్రీకరించిన మహా పండితుడు

## దాసు శ్రీరాములు

వ్యక్తులు-వ్యక్తిత్వాలు - 91

**కంచి వాసుదేవరావు**

సుమారు 140 సంవత్సరాల క్రితం నాటి ముచ్చట - పన్నెండు సంవత్సరాల బాలకవి ఒకడు నూజివీడు సంస్థానమును వెళ్ళి తన కవితాచాతుర్యాన్ని ప్రదర్శించాడు. అతని కవితాధారకు అబ్బురపడిన సంస్థాన విద్వాంసులు మాడభూషి వెంకటాచార్యులుగారు ఆశువుగా ఈ పద్యం,

**"పది రెండేడుల యీడునంగవిత చెప్పంబూని న్యసాక్షరీ**
**విదభిఖ్యాతి బొసంగి లేఖ కశత ప్రీఢాకరంబైన మీ**
**రదురిన్ బద్యము లల్లి సద్గణిత హోరాశాస్త్ర సామర్థ్యముల్**
**వెదజల్లందగు దాసురామ కవితా లీలాబ్ది నోలలాడిలిన్"**

చదివి ఆశీర్వదించారు.

ఈ బాలకవి పేరు దాసు శ్రీరాములు. గత శతాబ్దపు ఉత్తర భాగంలో తెలుగు నాట వెలసిన మహాకవులు మండపాక పార్వతీశ శాస్త్రి, వడ్డాడి సుబ్బరాయ కవి, తార్కాండ వెంకట రత్నంల సరసను నిలబడ గలిగినారు.

నన్నయ్యనుంచి నారాయణరెడ్డి వరకు తెలుగు కవుల రచనలను తన కావ్యమాలలో కాటూరు వెంకటేశ్వరరావుగారు 1920 శతాబ్దపు కవులలో మొదటి వారికగా భావించి వారి పద్యాలను జేర్చారు.

శ్రీ రాములుగారు మరో ఏడాదికి మరణిస్తారనగా తన 61వ ఏటన దేవీభాగవతపు పన్నెండు స్కంధాల్లోని 18272 శ్లోకాలను ఐదు నెలల స్వల్పకాలంలో తెనిగించారు. ఇందు శ్రీ శ్రీరాములు గారి కవితాశిల్పము, శాస్త్ర పరిణతీ పాటవం, కావ్య కళారామణయకమును ఒక్కుమ్మడి సంతరించుకున్నవి. కవిగారి లోకజ్ఞత రసజ్ఞతలు - వర్ణనిపుణతః కవి'. ఆభాణకమునకు కవిగారిని లక్ష్మీ సూతునిగా నొనర్చిన'వని - ఆయన కవిత్వంపై పరిశోధన జరిపిన డా॥ వెలగేటి వైదేహి అన్నారు. శ్రీ రాములుగారు హయగ్రీవోపాసకులు, కనుకనే ఇంత శీఘ్రకాలంలోనే అలవోకగా దేవీ భాగవతాన్ని తెనిగించారని కవిసామ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణగారు అన్నారు. మొత్తం శ్రీరాములుగారు - వివిధ జ్యోతిష వేద ధర్మాది శాస్త్రాలపై ముప్పయినాలుగు ప్రత్యేక గ్రంధాలు రచించారు.

దేవీ భాగవతము తర్వాత ఆయనకు అంతట ప్రఖ్యాతి తెచ్చినది. ' తెలుగునాడు' అన్న గ్రంథం. ఇందులో శ్రీరాములుగారు సమకాలిక కులాలపై ముఖ్యంగా వివిధ శాఖల బ్రాహ్మణుల ఆచార వ్యవహారాలను చక్కగా వర్ణించారు. ఒకప్పుడు తెలుగు దేశంలో యీ చాటువులు కంఠస్థము కాని విద్వాంతులు ఉండేవారు కారుట. ఈ చాటువులు చదివిన చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు వీరిని శ్రీనాధునితో పోల్చారు.

సరస్వతి స్తనద్వయంగా పరిగణింపబడ్తున్న సంగీత సాహిత్యముల రసామృతాన్ని తనివిదీర గ్రోలిన వారు శ్రీరాములుగారు. శ్రీరాములుగారు సుప్రసిద్ధ వాఙ్మయకారులే కాక వాగ్గేయ కారులు కూడా. కలం పట్టి పదం వ్రాయగలరు. పదం వ్రాసి పాడగలరు. పదం పాడి అభినయించి చూపగలరని వైదేహిగారు అంటారు.

శ్రీరాములు గారు అభినయం దర్పణం అనే నాట్య గ్రంధాన్ని రచించారు. ఆయన అనేక జావళీలు రచించారు. ఆరోజులలో వీటిని చాలామంది వేశ్యలు అభినయ పూర్వకంగా పాడేవారు. ఒరిస్సాలో 'చొక్కినట్టొ' అనే నాట్యసాంప్రదాయం ఉండేది. ఒకసారి ఒరిస్సా నాట్య కళాకారులు ఈ సంప్రదాయ నాట్య ప్రదర్శనను జరుపుతూ శ్రీరాములుగారు రచించిన "నా మనోరథము చూరగొన్న విన్నాణపు దొంగకు మంగళమ్'' అన్న శ్రీరాములుగారి కీర్తనతో తమ ప్రదర్శనను ముగించారుట. సంగీతం మీద దాసు శ్రీరాములు గారు. బందరులో ఒక సంగీత పాఠశాలను స్థాపించారు. వీణాధనం, బెంగుళూరు తాయి వంటి ఆనాటి సుప్రసిద్ధ సంగీత విద్వాంసులను బందరుకు ఆహ్వానించి సముచితరీతిలో సన్మానించేవారు.

శ్రీరాములుగారు 1846లో పరాభవనామ సంవత్సర చైత్ర శుద్ధ ద్వాదశినాడు కృష్ణాజిల్లా అల్లూరు

## యక్షప్రశ్నలకు సమాధానాలు

వృత్తం యత్నేన సంరక్ష్యం
బ్రాహ్మణేన విశేషతః
అక్షీణ వృత్తో న క్షీణో
వృత్త తస్తు హతో హతః

సదాచారాన్ని ఎట్లయినా రక్షించవలె, దీనికై బ్రాహ్మణుడు విశేషించి ప్రయత్నం చేయవలె. సదాచారం ఉన్నవాడు ఎప్పుడూ నాశాన్ని పొందడు. సదాచారహీనుడు తప్పక నాశాన్ని పొందుతాడు.

వాస్తవ్యులయిన కన్నయ్య, కావమ్మలకు జన్మించారు. ఇతన్ని తల్లిదండ్రులు బందరులోని నోబులు హైస్కూలులో చేర్చారు. ఇతని తెలివితేటలకు ప్రిన్సిపాల్ నోబుల్ దొర అచ్చెరువు పొంది తన యింటికి ఆహ్వానించి చిన్న చిన్న బహుమతులు యిచ్చేవారు. ఫలహారాలు అందచేసేవారు. ఆరోజులలో బందరులో క్రైస్తవ మత ప్రచారం ఉధృతంగా జరిగేది. క్రైస్తవ మతంలో చేరడానికి ప్రతిభావంతులైన యువకులను బహువిధాల ఆకర్షించేవారు. ఇందుకు నోబుల్ దొర నాయకుడు ఆయన శ్రీరాములను క్రైస్తవ మతాన్ని స్వీకరించేట్టు చేస్తారన్న భయంతో కన్నయ్యగారు అతన్ని స్వగ్రామానికి రప్పింపచేశారు.

### స్వయంకృషితో అపూర్వ పాండిత్యం

అక్కడనుంచి శ్రీరాములు స్వయంకృషితో ఇంటిలోనే సంస్కృతాంధ్రాలను అభ్యసిస్తూ పన్నెండవ యేటనే చక్కని కవిత్వాన్ని చెప్పగల ప్రతిభను సంపాదించు కున్నారు. ఇరవై ఐదు సంవత్సరాలు వచ్చేనరికి స్వయంకృషితో అష్టావధాన, శతావధాన, న్యస్తాక్షరీ, కవితలను అల్లగల నేర్పు సాధించారు.

గత శతాబ్దం చివరలో కృష్ణాజిల్లాలోని వల్లూరు జమీందారులు ప్రతి సంవత్సరం నవరాత్రి ఉత్సవాలను వైభవంగా జరుపుతూ కవి, పండితులను సత్కరించేవారు. యువకుడైన శ్రీరాములుగారు అట్టి నవరాత్రి ఉత్సవాలకు హాజరయి ఆస్థాన కవీంద్రులయిన మతుకుమల్లి నరసింహ శాస్త్రిగారు యిచ్చిన ఒక సమస్యను ప్రతిభావంతంగా పూరించి ప్రథమ బహుమతి పొందారు.

శ్రీరాములుగారు ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించారు. గుడివాడ పాఠశాలలో ప్రధాన ఆంధ్రో పాధ్యాయులుగా పనిచేస్తుండేవారు. వీరు ఆదర్శ ఉపాధ్యాయులు. ఇది గుర్తించిన సమీప డోకిపర్రు గ్రామ ప్రముఖులు తమ గ్రామంలో పాఠశాలను స్థాపించి విద్యా దానం చేయమని అభ్యర్థించారు. దాన్ని మన్నించి శ్రీరాములుగారు ఆ గ్రామానికి తన మకాం మార్చి అనేక మంది పిల్లలచేత హలం కాక కలం పట్టించారు.

### ఉపాధ్యాయునికి కనకాభిషేకం

ఉపాధ్యాయునిగా ఉండగానే ఇంగ్లీషు నేర్చుకుంటూ వరుసగా మెట్రిక్యులేషన్, క్రిమినల్ హయ్యర్, సివిల్ హయ్యర్ పరీక్షలలో ఫస్టు గ్రేడ్ ప్లీడర్ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. ప్లీడర్ పరీక్ష ప్యాసయి బందరులో ప్రాక్టీస్ పెట్టడానికి డోకిపర్రు గ్రామాన్ని వదలి వెళ్తున్న సమయంలో గ్రామస్తులు శ్రీరాములుగారిని ఘనంగా సన్మానించారు. వీరికి కనకాభిషేకమును గావించిరి. పెద్దన వలె వీరిని పల్లకిలో నెక్కించి ఊరేగించి వారి భక్తి ప్రపత్తులను ప్రదర్శించిరి. ఒక కవిగా కాక, ఒక ఉపాధ్యాయునిగా నాడుగాని, నేడు గాని ఇట్టి గౌరవము ఏ ఉపాధ్యాయుడునూ పొందలేదని వైదేహీగారు అంటారు.

బందరులో కొంతకాలం న్యాయవాదవృత్తి జయప్రదంగా చేసిన తర్వాత ఏలూరు సబ్‌కోర్టు ఏర్పాటు కావడం వలన శ్రీరాములుగారు తన మకాంను ఏలూరుకు మార్చారు. వీరి క్లయింట్లు అందరూ సంపన్నులే. అందువలన ప్రాక్టీసు బాగా ఉండేది. రాత్రి ఎనిమిది గంటల వరకు వృత్తి పరమైన పనులను చేసుకొని రాత్రి పదకొండు గంటల వరకు గ్రంథ రచన చేసేవారుట.

### పత్రికా సంపాదకత్వం

1880 ప్రాంతంలో వీరు అనల్పజల్పితా కల్ప కల్పవల్లీ అనే మాసపత్రికను బందరు నుంచి వెలువరించారు. దాని ముఖపత్రంపై ఇలా ఉంది. శ్రీరస్తు/ శ్రీమదల్లూరగ్రహార/వర్తమాన పరిపాలకులగు/ దాసు కన్నయ్య మంత్రి మార్తాండులకుం/ బుత్ర రత్నంబగు/ శ్రీరామ పండితునిచే రచియింపబడిన అనల్ప జల్పితా కల్ప కల్పవల్లీ/నామపత్రిక. ఇది బందరులోని కేశవరాజు సమూహం వారి స్వధర్మ ప్రకాశిని ముద్రాక్షరశాల యందు ముద్రింపబడింది. (ఇది 1880 జనవరి 20వ

'తేది సంచిక).

పత్రిక పేరు పండితులకు మాత్రమే అర్థమవుతుంది. ఇందులో సనాతన ధర్మ సమర్థన శాస్త్ర చర్చలు జరుగుతూ ఉండేవి. ఇది కందుకూరి వీరేశలింగం గారు తమ పత్రికలో ప్రచురిస్తూ వచ్చి సంస్కరణ భావాలను ఖండించడానికి ఉద్దేశించిన పత్రిక. అందువలన వివేకవర్ధని వ్యాసఖండన ఈ పత్రికలో జరిగేది. స్త్రీ పునర్వివాహ వాదాన్ని శ్రీరాములుగారు నిశితంగా ఖండించే వారు. ఐతే ఆయన పిడివాది కాదు. తన వాదం తప్పు అని తెలిసితే దాన్ని సరిదిద్దుకోగల ఉదారుడు - అందువల్లనే వీరేశలింగంగారి సంస్కరణ భావాల ఔచిత్యాన్ని కాలక్రమేణా గుర్తించగలిగారు. వెంటనే తన పత్రికను నిలిపివేసి వీరేశలింగంగారి ఉద్యమానికి బాసటగా నిలిచారు.

స్త్రీ విద్యా వ్యాప్తికి శ్రీరాములుగారు ఎంతగానో కృషి చేశారు. వీరి కుమార్తె శారదాంబ తండ్రి మాదిరి పన్నెండవ సంవత్సరం నుంచి కవిత్వం చెప్పసాగింది. పదిహేనవ యేట "నాగజలి పరిణయం" అనే ప్రబంధాన్ని రచించింది. సంగీతంలో దిట్ట. కాని 18వ యేటనే మరణించింది.

## దాసుగారి తీర్పు కళావతి ప్రశంస

1901 ప్లవంగ నామ సంవత్సరములో అధిక మాసం, ఆషాడమా, శ్రావణమా అనే విషయంపై పండితుల మధ్య ఆరోజులలో పెద్ద రగడ జరిగింది. ఈ వివాద పరిష్కారానికి పండిత సభ సమావేశమయింది. అనేక మంది ఉద్దండ పండితులు తమ వాదోపవాదాలను వినిపించారు. శ్రీరాములుగారు న్యాయ నిర్ణేతగా పాల్గొని అధికమాసం శ్రావణమేనని తేల్చి చెప్పారు. శ్రీరాములు గారి నిర్ణయాన్ని ఆరోజులలో కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి సంపాదకత్వంలో వెలువడిన 'కళావతి' మిక్కిలి ప్రశంసించింది.

శ్రీరాములుగారిలో జాతీయ భావాలు కూడా తక్కువగా లేవు. వందేమాతరం ఆందోళన నాయకుడు బిపిన్ చంద్రపాల్ బందరుకు వచ్చినప్పుడు ఆయన బహిరంగసభకు అధ్యక్షత వహించడానికి అందరూ వెనుకాడుతున్న సమయంలో శ్రీరాములుగారు ముందుకు వచ్చి సభను జయప్రదంగా నిర్వహించారు.

శ్రీరాములుగారు 1908 మే 16వ తేదీన తన పార్థివదేహాన్ని వదలివెళ్ళారు. ●

# "రికమెండేషన్"

ఈ రోజులలో రికమెండేషన్ (సిఫార్సు) కోసం ఎగబడే వారు లేరంటే ఆశ్చర్యపడాలి. ఒక పాత విషయం.

ఆయన ఒక కాలేజీలో అధ్యాపకుడు. చాలా కాలము నుండి ఒకే జీతము తీసుకుంటున్నారు. ఇనస్పెక్టరుగారు కళాశాల తనిఖీకి వచ్చి ఉన్నారు. ఆ కళాశాల కార్యదర్శి ఈ అధ్యాపకుని వద్దకు వచ్చి 'మీ జీతము ఎక్కువ చేయమని రికమెండ్ చేయకున్నారా?' అని అడిగాడు. అందుకు ఆ అధ్యాపకుడు "నా అర్హతను బట్టి ఈ విషయాన్ని పై అధికారులు ఆలోచించి చేస్తే చేస్తారు. మీరు నన్ను ఇటువంటి ప్రశ్నలు వేయ్యకండి" అన్నాడు. మరి ఆ కార్యదర్శి మాట్లాడలేదు.

జీతము ఎంత అని కాకుండా ఎంత పని అయినా చెయ్యడం వీరి స్వభావము.

వీరి పాఠాలు వింటే పరీక్షలో తప్పడం అనేది ఉండేది కాదుట. సాయంకాలము నాలుగు గంటలకు వీరి క్లాసు జరుగుతూ ఉండేదిట. వీరు ఎంత లేటుగా వచ్చినా గంటల కొలది ఆలస్యము అయినా విద్యార్థులు అందరూ వీరి రాక కోసం వేచి ఉండేవారుట. పాఠము వీరు మొదలు పెట్టి పూర్తి చేసేటప్పటికి రాత్రి అయినా సరే అలాగే ఉండి తన్మయత్వంతో వినేవారుట. వీరు ఆంగ్ల నాటకాలను బోధిస్తూ ఉంటే ఆనందంతో కదలకుండా వినేవారుట. ఈ రోజులలో ఇటువంటి అధ్యాపకులు ఎంతమంది ఉండిఉంటారు?

వీరు బందరులో జన్మించారు. సికింద్రాబాదు కాలేజీలో లెక్చరర్గా, కాకినాడ కాలేజిలో ప్రిన్సిపాల్గాను, మద్రాసు విశ్వవిద్యాలయానికి వైస్ ఛాన్సలర్గాను పనిచేశారు. ఈ మహనీయుడు మహావక్త అయిన బ్రహ్మర్షి శ్రీ రఘుపతి వేంకట రత్నం నాయుడు గారు.

- ఎన్.వి.ఆర్. సత్యనారాయణమూర్తి

# భగవంతుడు - భక్తవశంకరుడు

స్వరూప, స్వభావాలతో స్థలము నాక్రమించేది పదార్థమని, శాస్త్రజ్ఞుల నిర్వచనము. ప్రతి పదార్థానికి రూపం, గుణం, వ్యాపకత్వము ఉంటాయని వారి భావన. కంటికగోచరమైన వాయువు కూడా యిందులకతీతము గాదు. ఇక అట్టి నిర్జీవ పదార్థములను, జీవులను, ఈ విశాల విశ్వములో సృష్టించిన ఆ భగవంతునికి నిర్వచనం ఏమని చెప్పగలం? ఐనా చాలామంది తమతమ భావనలతో ప్రయత్నించారు. సర్వాంతర్యామి అన్నారు. సర్వశక్తిమంతుడన్నారు. చర్మచక్షుదృష్టికగోచరుడన్నారు. మనోనేత్ర దృగ్గోచరుడే నన్నారు. రూప,రస,గంధ రహితుడన్నారు. అయినా, వివిధ రూపాలలో ఆయన నారాధించుకొంటున్నారు. సకల సద్గుణ సమ్మోహితుడని సంస్తుతించారు. దీనజనబాంధవుడన్నారు. కరుణా సముద్రుడన్నారు. మరి ఇన్ని రకాలుగ నిర్వచించబడిన భగవంతుడు, తన సృష్టిలోని జీవకోటిని ఇడుముల పాల్జేయనేల? సకల ప్రాణులకు సతతము ఏ ఆపద వాటిల్లకుండగనే సంరక్షించవచ్చును గదా! ఆపదలను సృష్టించనేల? ఆపత్సమయాల్లో వారి మొరలాలకింపనేల? ఆలకించిన పిమ్మట ఆలసించకనే ఆదుకొనగనేల? ఈ తతంగమంతయు ఎందులకు? సంశయాత్ములైన సామాన్యులకెందరికో సమాధానం లభించని సందేహమిది. ఒక్కమాటలో చెప్పాలంటే, యిదంతయు ఆ లీలా మానుషవిగ్రహుని క్రీడా వినోదము.

సృష్టియంతయు భగవంతునిదే అయిననూ, సృష్టియందు సమత్వము గోచరించదు. ఎల్లజీవులకు జీవమొక్కటే అయినను, అందనేక జాతులుండును. జాతి ఒక్కటే అయినను అందనేక భేదములుండును. జంతు జాలమందు, పశుపక్ష్యాదులందు, క్రిమికీటకాదులందుకన్న, మానవ జాతియందే వైవిధ్యము మిక్కుటముగను, ప్రస్ఫుటముగను గోచరించును. మానవులందరి అవయవ నిర్మాణమొకటే అయినను, రంగుభేదము, రూపు భేదము, గుణభేదము, శరీర దారుఢ్యభేదము, వారిలో స్పష్టముగ పొడగట్టును. మూసపోసినట్లుగ పడవలసిన సమత్వమన్నది వారి యందు అగుపడదు. అంతటా సమత్వమేయున్నచో, చలనము, చైతన్యములుడిగి, జడత్వము సంభవించునని సృష్టికర్త భావమేమో! ప్రాణాధారమైన వాయువు ఒకే చోట యున్నచో ప్రాణికోటి మనుగడ సాధ్యమా? అందువలననే వాయువు అధిక పీడన ప్రాంతమునుండి అల్పపీడన ప్రాంతములకు ప్రసరించుట సహజముగా జరుగుచున్నది కదా! అట్లే జీవాధారమైన జలము నిత్యము ప్రవహింపక ఒకేచోట స్థిరముగ యున్నచో, జీవకోటి ఆధారమేమగును? ఇట్టి అసమానతల యందే సమానత్వమును సాధించుటన్నదే సర్వేశ్వరుని సృష్టి రహస్యము.

## సోమంచి రామం

సృష్టియందలి ప్రతి ప్రాణికి, నిర్దిష్ట, నిర్దుష్ట ప్రయోజనము నిర్దేశింపబడే ఉంటుంది. ఆయా జీవులు తమ తమ నిర్దేశిత కార్యములను నిర్వర్తించినపుడే ఆటంకములు, ఆపదలు సంభవించుట సహజము. అట్టి సమయములందు ప్రాణులు ఆర్తితో అలమటించెదరు. దప్పికగొన్న వానికే దాహము యిచ్చిన స్వీకరించును. ఆకలి గొన్నవానికే ఆహారమిడిన ఆరగించును. అవసరము కలిగిన వానిపైనే అపార కరుణ ప్రసరింపనవసరము. అట్లే ఆర్తితో అలమటించు ప్రాణులను ఆదుకొనుట భగవంతుని కానందము. ఆ ప్రాణులే మాటాడగల మానవులు, పలుకాడలేని మానవేతర జీవులు.

"ఆపద్బాంధవా! ఆపదలోనున్న నన్నాదు కోవయ్యా!" అంటూ ఎలుగెత్తి ఆక్రోశించిన అతివ ద్రౌపది మాన సంరక్షణ గావించినది ఎవరు? మనసారా తననే నమ్ముకొన్న పసిబాలుడు ప్రహ్లాదుని పన్నగముల బారి నుండి పట్టపుటేనుగు పద ఘట్టనముల నుండి రక్షించినది ఎవరు? శరణాగతి భక్తి భావముతో నీవే తప్ప నిత:పరంబెరుగనన్నట్లు మూగబాధతో ఘీంకార రోదనము గావించిన గజరాజు నాదుకొన్నదెవరు? భగవంతుడుకాదా? కావున నిర్మల హృదయముతో ప్రార్థన

చేసెడి ప్రతి భక్తునికి భగవదానుగ్రహము సంప్రాప్తించుట తథ్యము.

ప్రాణుల జీవాధారమగు జలము సదా నదుల యందు ప్రవహించుచునే యుండును. తన దప్పిక తీరుటకై ఆ నదీజలము తన వద్దకే రావలెనని కోరుకొనుట మానవుని అవివేకము కాదా? దప్పికగొన్న వాడు నదీ తీరమున కేగి దాహము తీర్చుకొనవలెను. అట్లే ఆర్తుడు దైవ ప్రార్థన, దైవారాధన చేసి భగవదానుగ్రహమును కోరవలెను. అప్పుడే ఆ భగవంతుడు ఆ భక్తుని బాధను తొలగించును. భగవంతునికి భక్తుల యెడ బేధభావము ఉండదు. పక్షపాత ధోరణి అసలే ఉండదు. తరతమ బేధమూ ఉండదు. తననాశ్రయించిన భక్తులందరకూ భగవంతుడు వశ్యుడే. పాండితీప్రకర్షతో స్తోత్ర పాఠములు వల్లించెడి పండితుడైనా, భాషాజ్ఞానము లేక, మూగభక్తినే ప్రదర్శించెడి పామరుడైనా భగవంతుని దృష్టిలో సమానమే. మానవుని అంతరంగపు భక్తి భావమే ఆయనకు ప్రధానము. ఆతని ప్రార్థనలోని భాషాభావముగాని, వ్యాకరణ దోషము గాని ఆయన అనుగ్రహానికి అవరోధములు కానేరవు. విశుద్ధ మనసుతో, పరిపూర్ణ హృదయార్పణ కావించెడి భక్తుడే ఆయన కిష్టుడు. నాటకము యందు పాత్ర ధరించిన నటుడు, నాటకము సాగినంతవరకు హావభావములను ప్రదర్శిస్తాడు. నాటకానంతరము, ఆతనికి, నాటకమందలి పాత్రకు సంబంధముండదు. అట్లే బాహ్యాడంబరాలతో, డంబాచారాలతో, ప్రకటనార్థము భక్తిని ప్రదర్శించే భక్తుడు భగవంతుని దృష్టిలో నటుడే.

దైనందిన నిత్యకృత్య వ్యావహారిక, లౌకిక సమస్యలతో సతతము సతమతమయ్యే నేటి సామాన్య మానవులు, దైవప్రార్థన, దైవారాధన, దైవభక్తి సాధ్యము కాకున్నవేయని చింతించవలసిన పనిలేదు. దినమంతయు సన్మార్గముననే సంచరించు శక్తి నొసంగుమని ప్రార్థిస్తూ, అను దినము ప్రాతఃకాలమున భగవన్నామమును స్మరించుట అట్టి వారికి సులభసాధ్యమే కదా! అట్లే ఆ దినాంతమున, పరుండుటకు ముందు, ఆ దినమందేదైన అపచారములొనరించిన, ఆ దోషమును మన్నింపమని వేడుకొనుచూ భగవన్నామమును స్మరించుకొనుట కష్టసాధ్యము కాదు గదా! భగవంతుడు అల్పసంతోషి. నిర్మల హృదయముతో మానవుడొనరించే ఈ స్వల్ప ప్రార్థనకే సంతుష్టుడై, ముగ్ధుడు కాగలడు. ఇంతకు మించి, భగవద్భక్తి వేరేమున్నది? భగవంతుడు భక్తవశంకరుడు, భక్తాధీనుడు అని గ్రహించుటకు ఈ భగవన్నామ స్మరణయే తారకమంత్రము, భగవన్నామ స్మరణము, సంకీర్తనములన్నవి భగవంతుని సన్నిధికి సోపానములు. భక్తులకివే సులభ ఉపాయములు. ✵

# దేవీ వినుతి వీణ

*చెడుపాలు కీడిడు నటులె*
*చెడువాంఛవిపత్తుదెచ్చు; సేమంబిడున*
*ప్పుడు దీసిన పాలవలెన్*
*కడునుత్తమ వాంఛలిచ్చు కావవె? దేవీ!*

*కడ ఋతువు కాలమప్పటి*
*గడసరి సొరకాయ భంగి కాయము హేయం*
*బడియాసలు సుఖమా? నీ*
*యడుగుందమ్ముల్ లిడు సుఖమనంతము దేవీ!*

*పరహింసా, పరదూషణ,*
*పరవిత్తాపహరణ, మధుపానద్యూతో*
*త్కర దుర్వ్యసనాసక్తుల*
*నరులంజేయకుము నీతనయులే దేవీ!*

*ఇనుమును త్రుప్పుదినుకరణి*
*తనదుష్కృతి తన్నునేచు తప్పదు నరునిన్*
*తన సత్కృతి తైలాదుల*
*మనిచిన యినుము విధిమేలు నొసగును దేవీ!*

*నరులం గలరు సురాసురు*
*లరయంబర పీడ కోరు నతఁడసురుండౌ*
*పరహితమె సదానెంచెడు*
*నరుడే దేవుడగు నిజము నగజా దేవీ!*

"పృథివి"

"భగవన్నామస్మరణ కంటే మేలైన మార్గం ఇంకొకటి లేదు"

*శ్లో॥ నామ సంకీర్తనంయస్య - సర్వపాప ప్రణాశనం*
*ప్రణామో దుఃఖ శమనం - తం నమామి హరిం పరం॥*

ఎవరి పేరును స్మరిస్తే అన్ని పాపాలూ పోతాయో, ఎవరికి నమస్కరిస్తే అన్ని దుఃఖాలు నశిస్తాయో, అట్టి శ్రీహరికి నమస్కారం.

'పరమబ్రహ్మ జ్యోతిర్మయం నామ ఉపాస్యం ముముక్షుభిః

భగవన్నామం, పరబ్రహ్మ జ్యోతి వంటిది. మోక్షాన్ని కోరు ప్రతివాడు భగవన్నామాన్ని స్మరించాలి. 'జాన మార్గం తునా మతం'. మోక్షం, జ్ఞానం వల్ల లభిస్తోంది. జ్ఞానం, భగవన్నామస్మరణ వల్ల కలుగుతుంది. భగవన్నామ సంకీర్తన చేయువారు జ్ఞానాన్ని కోరరు. భక్తితో చేసిన భగవన్నామ సంకీర్తన వల్ల పాపం నశిస్తుంది. తర్వాత జ్ఞానం కలుగుతుంది.

*శ్లో॥ శమాయాలం జలం వహ్నే స్తమసోభాస్కరోదయః*
*శాంతి కలౌహ్యా మౌఘస్య నామ సంకీర్తనం హరే॥*

అగ్ని జలము చేతను, చీకటి సూర్యోదయం చేతను, ఎలా హరించుకు పోతాయో ఈ కలియుగంలో మనుష్యుని పాపాలు భగవన్నామ సంకీర్తన వల్ల నశింప బడుతాయి.

*శ్లో॥ యత్ఫలం నాస్తి తపసా! నయోగేన సమాధినా!*
*తత్ఫలం లభతే సమ్యక్! కలౌ కేశవ కీర్తనాత్!!*

తపస్సుచేతను, యోగాభ్యాసం చేతను సమాధి చేతను లభించనట్టి ఫలం, కలియుగంలో భగవన్నామ స్మరణ వల్ల లభిస్తుంది.

ధన్వంతరి ప్రభువు ఇలా అన్నాడు

*శ్లో॥ అచ్యుతానంత గోవింద - నామోచ్చారణ భేషజాత్*
*నశ్యంతి సకలా రోగా - సత్యం సత్యం వదామ్యహం॥*

అచ్యుతా, అనంతా, గోవిందా అను భగవన్నామ స్మరణ వల్ల మానవులకు అన్ని రోగాలుపోతాయి. ఇది ముమ్మాటికీ సత్యం, సత్యం, సత్యం.

ఇందుకు ఎన్నో ఉదాహరణలున్నాయి. నమ్మకం మాత్రం ముఖ్యం. ఎల్లప్పుడు భగవన్నామాన్ని స్మరించడం వల్ల, పుట్టుకతో వచ్చు రోగాలు పోతున్నాయి. పుట్టుకతో వచ్చు రోగాలను కుదర్చగల భగవన్నామ స్మరణ, తప్పక భగవత్ సాక్షాత్కారం లభింపచేస్తుంది.

మానవులకు జీవన్ముక్తినిచ్చి, మోక్షాన్ని ప్రసాదిస్తుంది. సర్వ పాపాలను నశింప చేస్తుంది. సకల వాసనలను తుడిచి పెడుతుంది. కర్మత్రయం తగ్గిస్తుంది.

*శ్లో॥ అవశేనాపియన్నామ - కీర్తితే సర్వపాతకైః ।*
*పుమాన్విముచ్యతే సంధ్యః - సింహత్రస్తైర్మృగైరివ॥*

వరధ్యానంగా ఉన్నప్పుడు వేరేదృష్టితో భగవన్నామాన్ని స్మరిస్తే వెంటనే సింహాన్ని చూచి పారిపోయే లేళ్ళలాగా అన్ని పాపాలు నశిస్తాయి.

మనుష్యుడు నామసంకీర్తన చేసిన వెంటనే అన్ని పాపాలనుండి విముక్తుడగుచున్నాడు (అన్ని పాపాలు అంటే తెలిసీ తెలియక చేసిన పాపాలు, స్వయంగా చేసిన పాపాలు, ఒకరు చెప్పగా చేసిన పాపాలు, అందరికి తెలిసిన పాపాలు మొదలైనవి)

అందువల్ల చిన్నవారికి, పెద్దవారికి పాపపరిహారానికి భగవన్నామసంకీర్తనే ముఖ్యమైన సాధన. నామసంకీర్తన ప్రభావం వర్ణింప శక్యం కానిది.

భగవన్నామ స్మరణవల్ల పాపాత్ములందరి యొక్క పాపాలు నశించిపోతాయి.

తెలిసిగాని, తెలియకగాని పవిత్ర భగవన్నామాన్ని స్మరించినంతనే అగ్ని సమిధులను కాల్చి వేసినట్లుగా పాపాలు పోతాయి. ఇది సత్యం.

**- కవుల ఆంజనేయ శర్మ**

# సంఘసేవే సర్వేశ్వరుని సేవ

"Service to Humanity is Service To Divinity". "మానవసేవయే మాధవసేవగా భావించి చేసినప్పుడు మాధవుణ్ణి మానవునిలోనే చూడగల్గుతాం" అంటారు శ్రీ సత్యసాయిబాబావారు. మాధవుని చూడాలంటే మొట్టమొదట మానవునియందున్న మానవత్వాన్ని ముందు గుర్తించాలంటారు బాబా.

బాబావారు సేవకు అత్యధిక ప్రాధాన్యతనిస్తారు. అందులో గ్రామసేవకు మిక్కిలి ప్రాధాన్యతనిస్తారు. "గ్రామ సేవ బినా నిర్వాణనహీ" అంటారు బాబా. గ్రామాలు భారతావనికి పట్టుగొమ్మలుగదా! కనుక మొట్టమొదట గ్రామాలను అభివృద్ధిపరచాలని బాబా ఆశయం. అందుకోసమనే సత్యసాయి సంస్థలవారు ప్రతిమండలంలో కనీసం ఒక గ్రామమునయినా దత్తత తీసుకొని దానిని అభివృద్ధి చేస్తుంటారు.

"సేవకుడు కానివాడు నాయకుడు కాలేడు, కింకరుడుకానివాడు శంకరుడు కాలేడు" అని బాబా ఒక పర్యాయం చమత్కరించారు. ఇది చమత్కారంకాదు. వాస్తవం, యదార్థం. దేశసేవకుడైనవాడు అధికారంలోనికి వస్తే, నిస్వార్థ సేవచేస్తాడు అయితే ఈనాడు అధికారమును హస్తగతం చేసుకోవాలని అనేక అక్రమ, అనాచార, అవినీతి మార్గములను అనుసరిస్తున్నారు. చేయరాని, చేయకూడని పనులు చేస్తున్నారు. ఈనాడు పదవిని పొందటానికి ధనం ప్రధానసాధనమైంది. ఎన్నికలరంగంలో పెట్టుబడిపెట్టిన సొమ్మును తిరిగి రాబట్టుకోవటానికోసం అనేక అవినీతి మార్గములు అనుసరిస్తున్నారు. తత్ఫలితంగా దేశంలో అవినీతి పెచ్చుపెరిగిపోతున్నది. అభ్యుదయ కార్యక్రమాలకు కేటాయించిన సొమ్ములో చాలా భాగం అధికారంలోనున్న వ్యక్తుల చేతులలోనికి పోతున్నది. ఆశించిన ప్రగతి కనిపించటంలేదు. దేశంలో ఆర్థిక సంక్షోభం ఏర్పడుతున్నది.

ఈనాడు కొంతమంది పెద్దలు, కొన్ని సంస్థలు పేరుప్రతిష్ఠల కోసం సేవచేస్తున్నట్లు నటిస్తుంటారు. సేవా కార్యక్రమాలకు ఖర్చుపెట్టే సొమ్ముకన్నా ప్రచార ఆర్భాటాలకు ఎక్కువ ఖర్చుచేస్తున్నారు. దీనిని బాబా అంగీకరించరు. ఒక పర్యాయం సేవకు చక్కటి నిర్వచనం

## కొమరగిరి కృష్ణమోహనరావు

చెప్పారు. "సేవ అనేది ఎవరినీ ఆకర్షించుటకు చేసే Art కాదు. మనసేవ Heart నుండి రావాలి. Art is external, Heart is Internal. అప్పుడే Self Satisfaction (ఆత్మ తృప్తి) ఉంటుంది. చెప్పేది చెయ్యాలి. చేసిందే చెప్పాలి" అని అంటారు బాబా. బాబా చాలా Practical Man. మాట్లాడే ప్రతిమాట వెనుక మానవత్వం, ప్రేమతత్వం ప్రతిబింబిస్తుంటుంది. వారి ప్రతిమాటలో Art ఉట్టిపడుతూ ఉంటుంది. ఆ మాటల వెనుక Love తొణికిసలాడుతూ ఉంటుంది. అదివారి Heart నుంచి వస్తుందిగాని Lips నుండి కాదు. అదేవారి ప్రత్యేకత. బాబా కోరేది 'నిష్కామసేవ'. ధనమున్నది గదాయని డబ్బిచ్చి సేవాకార్యక్రమాలు జరిపించడానికి అంగీకరించరు బాబా. శ్రమదానం ద్వారా సేవచేయాలంటారు బాబా. అందువలననే కె.జి. నుండి పి.జి. వరకు ఉచిత విద్యను విద్యార్థులకు యిస్తున్నారు బాబా. సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌ను నెలకొలిపి వేలాదిమందికి ఉచితంగా గుండె శస్త్రచికిత్సలు చేయిస్తున్నారు బాబా. విద్య, వైద్యరంగములలో బాబా చేస్తున్న సేవ ప్రపంచంలోనే మరెవ్వరూ చేయటంలేదు. ఏ ప్రభుత్వమూ చేయటంలేదు.

'సేవ' అంటే చాలామంది 'మంచిపని' (Good Work) అని భావించి చేస్తుంటారు. బాబా దీనిని అంగీకరించరు. సేవ అనేది మంచిపని మాత్రమే కాదు, దైవము యొక్క పని (God's Work) అని భావించి చేయాలంటారు బాబా. ఇటువంటి అత్యున్నతమైన, పవిత్రమైన భావనను బాబా తమ భక్తులలో కలుగచేస్తున్నారు. దైవకార్యం చేస్తున్నాననే భావన మనసులో ఉండినప్పుడు సేవ నిష్కామకర్మగా మారుతుంది.

ఈనాడు జాతీయ నాయకుల జన్మదినాలకు గాని, వర్ధంతులకుగాని అన్నదానం అని Poor Feeding చేస్తున్నామని చెబుతుంటారు. బాబా దీనిని అంగీకరించరు. 'నారాయణసేవ' చేస్తున్నామనే భావనతో పేదలకు, బీదలకు, అవిటివారికి అన్నం పెట్టాలంటారు బాబా. దీనికి కారణం? ప్రతి జీవిలో భగవంతుడు ఆత్మ స్వరూపుడై ఉన్నాడు. ఈ భావన మనలో కలిగినప్పుడు మనం చేసే పని పవిత్రమైనదవుతుంది. బాబా ఆశించేది సానుభూతితో కూడిన సేవకాదు. నైతిక సానుభూతికన్నా అన్ని విధాలా ఉత్తమమైనది ఆధ్యాత్మిక ప్రేమ. సేవలోని ఆధ్యాత్మిక అనుభూతిని, ఆనందమును సేవచేసేవారు, సేవను పొందేవారు పంచుకొనినప్పుడు సేవ, యోగంగా మారుతుందంటారు బాబా.

శ్రీ సత్యసాయిబాబావారు సేవ యొక్క పవిత్రతను చక్కగా వివరిస్తూ, "సంఘసేవే సర్వేశ్వరుని సేవగా విశ్వసింపుడు. సమాజమును భగవంతుని విశ్వరూపంగా తలంచుడు. పేరు ప్రతిష్టలకు ప్రాకులాడక, ద్వేషభావములకు చోటివ్వక, వ్యక్తిత్వమును వెనుకకునెట్టి, శక్తిసామర్థ్యముల కొలది సంఘసేవకు కంకణం కట్టుడు" అని అంటారు బాబా. ఈ మాటలు సంఘ సేవలకు మంచి హెచ్చరిక. ముఖ్యంగా దేశ నాయకులైన వారు ఈ మాటలను ఆచరణలో పెడితే, ఆ దేశం సస్యశ్యామలమవుతుంది. అయితే ఈనాడు నాయకులు 'పదవి'కి యిచ్చిన ప్రాధాన్యత 'సేవ'కు యివ్వటంలేదు. అందువలననే దేశం అనేక యిక్కట్లకు గురిఅవుతున్నది.

"సేవ చేయటంలో కార్యదీక్ష, నిర్మల ప్రేమ, నిరాడంబరత్వం, అహంకార రాహిత్యం" ఉండాలంటారు బాబా. ఈ నాలుగు సంఘసేవకులు ముఖ్యంగా అలవరుచుకోవలసిన సద్గుణాలు. సేవలో ఎంతో నిగూఢమైన అర్థం ఇమిడి ఉన్నది." సేవ జీవితమును ఆనందమును, రుచిని కలిగించే లవణం వంటిది. సేవలో ఉన్నది పవిత్రత. సేవ ద్వారా ప్రేమ అనుభూతిలోనికి వస్తుంది. హృదయం విశాలమవుతుంది. సేవ ద్వారా భగవంతుని మెప్పును కూడా పొందవచ్చును. సేవ చేసి లక్ష్మీదేవి తరించింది. సేవకునిగా, నమ్మినబంటుగా హనుమంతుడు ప్రశంసలనందుకున్నాడు. సేవను గురించి ఉపన్యాసం చెప్పడంకంటే సేవచేసి చూపించడంలోనే ఉన్నది గొప్పతనం" అంటారు బాబా.

విద్య, వైద్య, సేవారంగములలో శ్రీ సత్యసాయి బాబావారు చేస్తున్న కృషి ఎనలేనిది. కనుక వారిని ఆదర్శంగా గైకొని మన జీవితాలను సార్థకం చేసుకుందాం.

---

## శ్రీవాణి జీవిత సభ్యులు



**Sri KALAPATAPU SITA RAMA RAO,**
*Advocate*
MACHILIPATNAM

# మంచి అవకాశము

 87215
S.T.D. 08555



# శ్రీసాయిహరి రియల్ ఎస్టేట్స్

## పుట్టపర్తి

**మీకు పుట్టపర్తి యందు ప్లాట్లు ఇండ్ల స్థలాలు కావలసినవారు, అమ్మదలచినవారు ఈ క్రింది అడ్రసుకు సంప్రదించవలెనని కోరడమైనది.**

1. సూపర్ స్పెషాలిటి హాస్పిటల్ ఎదురుగా గల ప్లాట్లు.
2. గోకులం పోస్టాఫీస్ ఎదురుగా గల ప్లాట్లు.
3. M.R.O. ఆఫీసు ఎదురుగా గల ప్లాట్లు.
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డుకు గల ప్లాట్లు.
5. అపార్ట్‌మెంట్స్ కావలసినవారు.
6. ప్రశాంతి నిలయము దగ్గరలో గల ప్లాట్లు.

***ప్రతినెలా 10వ తేదీన వాసవీ నివాస్ నందు డ్రా తీయబడును.***

**క్రొత్తగా ప్రవేశపెట్టిన స్కీములో చేరండి 20X40 రెండు సెంట్లకు నెలకు రు. 600-00. 36 నెలలు. "మారుతీ కారు బంపర్ డ్రా"**

ఇట్లు

శ్రీ సాయి హరి రియల్ ఎస్టేట్స్

**ప్రొ॥ పి. సిద్దయ్య శెట్టి**

ఆర్యవైశ్య సంఘము వైస్ ప్రెసిడెంట్

**ఆర్యవైశ్య సత్రం ఫ్రంట్ రూమ్, పుట్టపర్తి**

# సంస్కృతి - సంస్కారం

సంప్రదాయమైనా, సంస్కారమయినా ఏ జాతి తీరుతెన్నులు ఆజాతివే. సంస్కారమనేది పవిత్రమయిన గంగానది వంటిది. ఆ నదిలో ఎన్ని కల్మషాలు వచ్చిచేరినా దాని పవిత్రత దెబ్బతినకుండా ఏవిధంగా నిరంతరం ప్రవహిస్తూనే ఉంటుందో, అదే విధంగా ఎన్నో విదేశీ దాడులకు గురియైనా ఈ దేశ సంస్కృతీ సంప్రదాయాలు మాత్రం విచ్ఛిన్నం కాలేదు. ఈ సంస్కృతీ సంప్రదాయ పరిరక్షణలో అనాది కాలం నుండి అందెవేసిన చెయ్యి స్త్రీ జాతిదే. పురుషుడు అతని యొక్క వృత్తివ్యాపారములు, వ్యవహారముల వల్ల మన సంప్రదాయ పద్ధతులను అనుసరించలేకపోవచ్చు. కానీ స్త్రీ అలాకాదు. పురాణ కాలం నుండి స్త్రీ పురుషునికి అర్ధాంగి అన్న పేరును సార్ధకం చేసుకుంటూనే ఉన్నది. శివునిలో సగభాగంగా ఉన్నది పార్వతి. విష్ణుమూర్తి వక్షస్థలంలో ఉన్నది లక్ష్మి, బ్రహ్మ నాలుకపై ఉన్నది సరస్వతి. స్త్రీ ప్రకృతి, చైతన్య స్వరూపిణి. తనదైన ప్రత్యేకత ఆమెకెప్పుడూ ఉన్నది. పతితో సమానంగా తపమాచరించి త్రిమూర్తులకు మాతృమూర్తి అయినది అనసూయ. మహా తపసంపన్న మహారాజు కూతురు, సకల కళాకోవిదురాలు, సౌందర్యవతి, అగస్త్యుని భార్య లోపాముద్ర. సత్యభామ శ్రీ కృష్ణునితో పాటు యుద్ధరంగానికి వెళ్ళిన సంగతి అందరికీ తెలిసిందే. తరువాత కాలంలో గార్గి, మైత్రేయి, కాత్యాయిని లాంటి వారు పతిసేవ, తపస్సులేకాక, సభల్లో వాదోపవాదాలు కూడా జరిపేవారు. వారేకాక కాలంతో కొంచెం ముందడుగువేస్తే రుద్రమదేవి, ఝాన్సీరాణి లాంటి వీరవనితలు, మొల్ల వంటి కవయిత్రులు, సరోజినీనాయుడువంటి రాజకీయవేత్తలు ఎందరో ఉన్నారు. అందరినీ గురించి వ్రాయాలంటే ఒక గ్రంధం తయారవుతుంది. పైవారి నుండి ఈనాటి స్త్రీల వరకు అందరూ మన సత్‌సంప్రదాయములను, సంస్కృతినీ పాటిస్తూ ఇంటాబయటా కూడా, ఇటు కుటుంబానికీ, అటు దేశానికీ వన్నె తెచ్చినవారే. కాలానుగుణంగా ఇప్పటి స్త్రీలు కూడా అన్ని రంగాలలోనూ ముందంజవేస్తూ, ఇంటా బయటా కూడా అన్ని పనులూ నిర్వహించుకుంటున్నారు. అది గర్వకారణమే. కాని కొందరుమాత్రం పాశ్చాత్య దేశాల వ్యామోహంలోపడి హక్కులు కోసం పోరాడి అలసి పోతున్నారు. తనకూ, తనవారికీ కూడా సుఖ శాంతులు లేకుండా చేసుకుంటున్నారు. ఇది సరైన పద్ధతి కాదు. ఇంటాబయటా కూడా ఓర్పుతో, నేర్పుతో సరిదిద్దుకొని పోగలిగినప్పుడే మన పూర్వపు ఖ్యాతిని నిలబెట్ట గలుగుతాము. అప్పుడే భారత స్త్రీకి ఒక ప్రత్యేకత ఉంటుంది. ఆ విధంగా ఉండాలని ఈనాటి యువతు లందరూ కంకణం కట్టుకున్నవేళ, మన భరతమాత ఎంతో గర్విస్తుంది. ఏ కుటుంబాన్నయినా చెడగొట్టేదీ ఆడదే, బాగుచేసేదీ ఆడదే. ఆ సంగతి ప్రతి ఒక్కరూ గుర్తుంచుకొని నడుచుకుంటే గృహమే కదా స్వర్గసీమ ! అన్న మాట ఋజువవుతుంది. ☆

**సాయి ప్రియ**

# గ్రంథ సమీక్ష

## ఆంధ్రయోగులు (ప్రథమ భాగం)

రచయిత : డా॥ బి. రామరాజు
(నేషనల్ రీసర్చ్ ప్రొఫెసర్)
1/8 డెమ్మీ, 414 పేజీలు, వెల : రూ. 100-00

**సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :**
నవోదయ బుక్ హౌస్, 3-3-865, ఆర్య సమాజం
ఎదురు వీధి, కాచిగూడ, హైదరాబాద్ - 27.

ఇది వేదభూమి, కర్మభూమి, యోగభూమి. ఎందరో మహానుభావులకు జన్మయిచ్చింది ఈ భరతమాత. సాధు సంతులు, సిద్ధులు, భక్తులు, జ్ఞానులు, ఇంకా ఎందరో..... ఈ పుణ్యభూమిలో పుట్టారు. యావత్ ప్రపంచానికి ధర్మబోధగావించారు. తరింపచేశారు. మహనీయులు, మహాయోగుల పాదధూళి చేత ఆంధ్రావని పవిత్రమైనది. అట్టి మహా పురుషుల సంక్షిప్త జీవిత సంగ్రహమే ఈ 'ఆంధ్రయోగులు' గ్రంథం.

ఈ గ్రంథమును ఆంధ్రులకు పరిచయం చేయటానికి ఈ గ్రంథ రచయిత డా॥ బి. రామరాజుగారి కృషి ప్రశంసనీయం. ఈ గ్రంథంలో 50 మంది యోగుల చరిత్ర యివ్వబడింది. ఇంతమంది మహనీయులు, మహాయోగుల చరిత్ర ఒకచోట చేర్చి పాఠకులకు అందించటం అంతతేలికైన విషయం కాదు. ఈ మహాప్రయత్నంలో వారు చేసిన శ్రమ వర్ణనాతీతం. భగవాన్ సత్యసాయిబాబావారి దివ్యాశీస్సులు ఈ రచయితకు నిండుగా, దండిగా ఉండటం వలననే వారు చేసిన కృషి ఫలించిందని నా నమ్మకం. ఇది యదార్థం కూడాను. కృషి ఉంటే కృప ఉంటుంది. ఈ రచయిత కృషికి దైవకృపతోడు కావటంవలన ఈ గ్రంథం ఆంధ్రులకు అందించబడింది. ఈ గ్రంథం ప్రతి ఒక్కరూ విధిగా చదవాలి. చదివి అవగాహన చేసికోవాలి, మహాయోగుల ప్రవచనాలను ఆచరణలో పెట్టాలి. ప్రతి గృహంలో, ప్రతి విద్యాలయంలో, ప్రతి గ్రంథాలయంలో ఉండదగ్గ ఉత్తమ గ్రంథం ఇది. స్వంతం చేసుకోండి ! యోగుల అనుగ్రహమునకు పాత్రులుకండి !'

సమీక్షకులు - **సాయిప్రియ**

## పురాణ పరిచయము

రచన : జానమద్ది రామకృష్ణ
(రీడర్, వ్యాకరణ విభాగ్ అధ్యక్షులు)
సంస్కృత విద్యా పీఠము, తిరుపతి
1/8 డెమ్మీ, 152 పేజీలు, వెల రూ. 100-00

**ప్రతులకు :**
శ్రీమతి జె. లీలావతి,
సద్గురు నిలయం
1097/ ఎ. ఎన్. జి. ఓ. కాలనీ
కె. టి. రోడ్, తిరుపతి - 517 507

ఈ గ్రంథములో అష్టాదశ పురాణములను గురించి సంక్షిప్తంగా పరిచయం చేయబడింది. ఈ చిన్ని గ్రంథమును తీర్చిదిద్దటంలో రచయిత చూపిన చాతుర్యం, శక్తి సామర్థ్యములు ఎంతటివో ఈ గ్రంథం చదివినవారికే తెలుస్తుంది. ఈ చిన్ని గ్రంథం చదువుతే అష్టాదశ పురాణములను గురించి సామాన్యునికి కూడా ఒక అవగాహన ఏర్పడుతుంది. అవగాహన కలగటమేగాక పురాణపఠనాసక్తిని కూడా పెంచుతుంది. ఈ చిన్ని గ్రంథంలో పురాణ కథలతోపాటు, ప్రతి ఒక్కరూ గుర్తుపెట్టుకోదగ్గ, కంఠస్తం చేయదగ్గ శ్లోకాలు. వాటి వివరణ యివ్వడం రచయిత ప్రత్యేకత. గ్రంథ రచన సరళంగా, చదువరుల్ని ఆకట్టుకునేలా ఉండటం రచయిత ప్రత్యేకత. ప్రతి ఒక్కరూ చదువవలసిన గ్రంథం. ప్రతి విద్యాలయంలో, గ్రంథాలయం స్వంతం చేసుకోదగ్గ ఉత్తమ గ్రంథం ఈ "పురాణ పరిచయము".

సమీక్షకులు - **భరద్వాజ్**

శ్రీ రామరక్షాస్తోత్ర, హనుమాన్ చాలీసా, ఆదిత్య హృదయస్తోత్ర సహిత

## శ్రీ లలితా విష్ణు సహస్రనామ స్తోత్ర రత్నాలు

సైజు : 1/8 డెమ్మీ, బహువర్ణ ముఖ చిత్రం, పుటలు : 104
పెద్ద టైప్‌లో ఆఫ్‌సెట్ ముద్రణ, వెల : రూ. 15-00
సంపాదకుడు : **పురాణపండ రాధాకృష్ణమూర్తి**
సమీక్షకులు : **శ్రీ తులసి సూర్యకృష్ణారావు - హైదరాబాద్**

వృద్ధులను దృష్టిలో పెట్టుకుని రాజమండ్రి భాగవతమందిరం వారు అనేక ఆర్ష గ్రంధరత్నాలను పెద్దటైప్‌లో ప్రచురిస్తున్నారు. అందులో శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు అన్న పుస్తకరత్నం ఒకటి.

ఇందులో 1. శ్రీ లలితాష్టోత్తర శతనామ స్తోత్రం, 2. శ్రీ లలితా సహస్రనామస్తోత్రమ్, 3. శ్రీ విష్ణు సహస్రనామస్తోత్రమ్, 4. శ్రీ లక్ష్మ్యష్టోత్తర శతనామస్తోత్రమ్, 5. అష్టలక్ష్మీ స్తోత్రమ్, 6. అర్జునకృతదుర్గాస్తుతి, 7. శ్రీ దేవీ ఖడ్గమాలా స్తోత్రమ్, 8. మహిషాసుర మర్దినీ స్తోత్రమ్, 9. నవరత్నమాలికా స్తోత్రమ్, 10. హనుమాన్ చాలీసా, 11. ఆదిత్య హృదయం, 12. శ్రీ లలితా త్రిశతీస్తోత్రమ్, 13. శ్రీ రామరక్షాస్తోత్రమ్, 14. శ్రీ వెంకటేశ్వర సుప్రభాతమ్.

సర్వుల పూజాపీఠాలలో శాశ్వతంగా ఉండవలసిన పుస్తకరత్నం యిది. ఇందులో సర్వులూ ఏదో ఒక స్తోత్రరత్నాన్ని పారాయణ చేసుకుంటారు. తల్లిదండ్రులూ, గురువులూ అయినవారు తమ బిడ్డలకూ, శిష్యులకూ విధిగా కానుకగా సమర్పించదగిన పుస్తకరత్నం యిది.



## శ్రీ లలితా విష్ణు శివ స్తోత్ర రత్నాలు

సైజు : 1/8 డెమ్మీ, ఆఫ్‌సెట్ ముద్రణ
బహువర్ణ ముఖ చిత్రం, బైండ్ ప్రతిపుటలు : 104
వెల : రూ. 50-00 వి.పి. పద్ధతిలేదు.
సమీక్షకులు : **డా॥ శ్రీమతి ఎస్. జగదీశ్వరీ, కాకినాడ**

వయోవృద్ధులు సయితం అత్యంత సుగమంగా పారాయణ చేసుకోగలగాలన్న విశాల దృష్టితో సంపాదకులు శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి అత్యధిక వ్యయ ప్రయాసలకోర్చి సర్వాంగ సుందరంగా శ్రీ రాజరాజేశ్వరీ పరమేశ్వరి యొక్క సుందర బహువర్ణ ముఖచిత్రంతోనూ, శ్రీ చక్రరాజం యొక్క బహువర్ణ సుందర పృష్టచిత్రం తోనూ "నభూతో నభవిష్యతి" అన్నట్లు ఈ పారాయణ గ్రంధాన్ని విడుదల చేశారు. ప్రకాశకులకు విశ్వవ్యాప్తంగా గల ఆంధ్ర ఆస్తికులందరూ ఋణపడి ఉన్నారనడంలో సందేహంలేదు.

సుమారు 104 పుటలలో వెలువడిన ఈ గ్రంధరత్నంలో 36 పాయింట్ పెద్దటైప్‌లో (1) శ్రీ లలితా సహస్రనామ స్తోత్రమ్, (2) శ్రీ లలితాష్టోత్తర శతనామ స్తోత్రమ్, (3) శ్రీ లలితా త్రిశతీ స్తోత్రమ్, (4) అష్టలక్ష్మీ స్తోత్రమ్, (5) అర్జునకృత దుర్గాస్తుతి, (6) శ్రీ దేవీ ఖడ్గమాలా స్తోత్రరత్నమ్, (7) మహిషాసురమర్దినీ స్తోత్రమ్, (8) నవరత్నమాలికా స్తోత్రమ్, (9) ఆదిత్య హృదయమ్, (10) శ్రీ వెంకటేశ్వర సుప్రభాతమ్, (11) శ్రీరామరక్షా స్తోత్రమ్, (12) హనుమాన్ చాలీసా, (13) మారుతి స్తోత్రమ్, (14) హనుమత్ బడబానల స్తోత్రమ్, (15) హనుమత్ సూక్తమ్, (16) కనకధారా స్తోత్రమ్, (17) వచనంలో నారాయణ కవచము, (18) అమోఘ శివకవచమ్, (19) మంగళహారతులు - పొందుపరచబడ్డాయి.

ఈ పుస్తకరత్న ప్రచురణకు రూ. 5000-00లు విరాళం అందజేసిన అమెరికా - వాటర్‌లూ సిటీ వాస్తవ్యులు, ఆంధ్రులు - శ్రీమతి కె. రూపారెడ్డి, డాక్టర్ శ్రీ కె. సురేష్‌రెడ్డి దంపతులకు శ్రీ రాధాకృష్ణమూర్తిగారు కృతజ్ఞతలూ, మంగళాశీస్సులూ అందజేశారు. ముఖ్యంగా దేవాదాయ శాఖవారు ఇట్టి ప్రచురణలకు అత్యధిక సంఖ్యలో ఆర్డర్స్ యిచ్చీ, శ్రీమంతులైన ఉదారులు భూరివిరాళాలను అందించీ ప్రకాశకులను ప్రోత్సహించడం ఎంతైనా అవసరము.

ప్రతులకు :
**పురాణపండ రాధాకృష్ణమూర్తి**
గోదావరి రైల్వే స్టేషన్ దగ్గర, సూర్యాహోటల్ ప్రక్కన,
రాజమండ్రి - 4.